

షోలింగర్ కొండమీది శ్రీ నరసింహస్వామి గుడికి పోవుదారి



శ్రీ నరసింహస్వామి ఆలయపు దగ్గఱ దృశ్యము

By Sri S. T. Arasu




### సాలుచందా మొదలగునవి

ఈ సచిత్రమాసపత్రిక సాలుచందా రు. 4-8-0. అర్థసంవత్సరపు చందా రు. 2-8-0. అంతకు తక్కువ కాలపరిమితి చందా పద్ధతిలేదు. విడికాపి ఆరు అణాలు. చందాదారులు ఏమాసమునుండియైన ప్రారంభము చేయవచ్చును. విడికాపీలు వలయువారు వాని విలువమేరకు తపాలా బిళ్లలు పంపవలయును. వీ. పీ. పద్ధతి వ్యయమూలకము. బర్మాకు రేట్లు ప్రత్యేకము.

### ప్రకటనలు

ముఖ్యముగా స్త్రీల కందీయవలసిన వస్తువులనుగూర్చి ప్రకటించుట కీపత్రిక ఎంతయు అనువైనది. ప్రకటన చార్జీలు ప్రతిమాసము ముందుగానే చెల్లింపవలయును. కాలుపుటకు తక్కువయైన ప్రకటనలు చేకొనజాలము. రేట్లకొఱకు వ్రాయునది.

### వ్యాసములు వ్రాయువారికి

వ్యాసముల ముఖ్యాశయము స్త్రీజనాభ్యుదయమై యుండవలెను. అవి సంగ్రహముగ నున్న శీఘ్ర ప్రచురణకు వీలగును. ఒకే ప్రక్కసిరాతో స్పష్టముగ తప్పులు లేక వ్రాయవలెను. భాష గ్రాంధికముగాని, వ్యావహారికముగాని కావచ్చును; రెండును కలిపి వ్రాసిన అంగీకరింపబడవు. వ్యాసముల ప్రకటించుటలో సంపాదకులకు సర్వ హక్కులు గలవు. ప్రకటింప నంగీకరింప బడినపుడు మాత్రము రచయితల కట్లు తెలుపబడును. విమర్శనార్థము పంపు గ్రంథములు రెండుప్రతులు పంపవలెను. రిప్లైకార్డు వ్రాసిననే బదులివ్వబడును.

### సంచికలు చేరనిచో

సంచికలు చేరనిచో ఆయామాసములందు వెంటనే మాకు తెలుపవలయును. చిరునామామార్పును తెలుపకుండుటచే కాపీలు చేరనివారికి తిరుగ పంపజాలము. సంచికలు చేరనివారు తమతమ పోస్టాఫీసులలో కంప్లైంటును చేయునది.

### చిరునామా మార్పు

చిరునామాయందు మార్పున్నచో ముందుగానే తెలుపవలయును. ఇట్లు తెలుపనిచో కాపీలు తిరుగ పంపజాలము.

### ముఖ్యమైన గమనింపు

చందాదారులుగ చేర్చుకొనుమని వ్రాయు ఉత్తరములు, ఇతరమైన ఉత్తరములు మానేజరు, గృహలక్ష్మి, రాయపేట, మదరాసు అను చిరునామాకే వ్రాయవలయును. చెక్కులు, మనియార్డర్లు, పోస్టలు ఆర్డర్లు 'కేసరికుటీరం ప్రైవేట్ లిమిటెడ్' పేర పంపవలెను.

చెక్కులు మద్రాసు బ్యాంకులపైననే పంపవలెను.

# గృహలక్ష్మి

స్త్రీల ఆరోగ్యసౌభాగ్యములను సంపాదించుట
కేర్పడిన సచిత్ర మాస పత్రిక

వ్యవస్థాపకులు
డాక్టరు. కే. యన్. కేసరి

ఆక్టింగ్ ఎడిటర్
సి. సి. పున్నయ్య

సంపుటము ౨౮] జూన్ 1956 [సంచిక ౩

# వి ష య సూ చి క

—(౦)—



—(౦)—




జయజయ గృహలక్ష్మి సఖి! జయజయ లలితాంధ్ర! మధుర సారస్వతిమా!
జయజయ లలనా రత్నమ! జయజయ విద్యాప్రబోధ! జయకల్యాణీ!



# నైతికస్థాయి

ప్రజల నైతికస్థాయి నానాటికి తగ్గుతున్నదని రాజాజీ అభిప్రాయము.

రాజాజీ అభిప్రాయమును వ్యతిరేకిస్తూ ప్రజల నైతికస్థాయి ఉన్నతపథంలోనే యున్నదని శ్రీ వినోబాభావే అభిప్రాయము.

మానవుని జీవయాత్ర శాంతి భద్రతలతో సౌభాగ్యవంతంగా నుండటానికి నీతి నియమాలు అత్యవసరము. నీతి నియమాలు సన్నగిలిననాడు మానవ జీవితము ప్రమాదావస్థలో నున్నదని చెప్పాలి.

ఉత్తమ నైతికస్థాయికి చిహ్నాలు ఉదార హృదయము, విశాల దృక్పథము, ప్రజలలో పరస్పర సానుభూతి సద్భావత్యాగాలు.

ప్రతి మానవుడు తన జీవయాత్రలో సుఖపడగోరడం సహజము. కాని తన జీవిత విధానం తన్ను మాత్రం సుఖపెట్టడమేకాక యితరులు సయితం వారి వారి అవకాశాలు, హక్కులతో సుఖపడటాన్ని ప్రోత్సహించ కలుగాలి.

స్వార్థము నైతికస్థాయిని పరిమితపరుస్తుంది. స్వార్థచింత తగ్గినకొలది హృదయం ఉదారమగుతుంది; దృక్పథం విశాలమగుతుంది. ఉన్నంతలో తన జీవితాన్ని క్రమబద్ధంచేసికుంటూ, యితరుల కష్ట సుఖాలను సానుభూతితో చూడకల్గుతాడు. ప్రతి మానవుడు తన జీవిత విధానంవలన తోటివారికి యిబ్బంది, యిరుకు కలుగకుండా అవకాశముంటే యితరులకు సహాయపడుతూ తన పురోభివృద్ధిని నలుగురితోబాటు రూపొందించుకుంటాడు.

అధికార, ఆధిపత్య, దోపిడి వ్యామోహాలు మానవ జీవితంలో అభివృద్ధి నిరోధకాలు. అవి మానవ సంఘంలో పెచ్చుపెరిగియుంషటం నైతికస్థాయి తగ్గుదశలో నున్నదని చెప్పడానికి నిదర్శనము.

స్వార్థానికి, సంకుచిత తత్వాలకు, అహూయిత్వానికి అలవాటుపడి తమ తమ బాధ్యతలను మరచిపోయి న్యాయా న్యాయాల విచక్షణకు దూరమయి దారి డొంక లేని జీవితం గడుపడం నైతికస్థాయి లోపమునే సూచిస్తుంది.

ఇప్పటి ప్రజల నైతిక స్థాయిని గురించి అభిప్రాయమును వెలిబుచ్చేముందు ప్రజలలో ప్రస్తుతమున్న సద్భావ సహకారాలు, దృక్పథము, మంచిచెడ్డల విచక్షణా జ్ఞానము యిత్యాదులను వాస్తవిక పరిజ్ఞానముతో పరిశీలించాలి.

రాజాజీ యదార్థవాది. ప్రతి సమస్యను వాస్తవికత కనుగుణ్యంగా ఎదుర్కోవాలనేవాడు. కాబట్టే ఆయన బుద్ధికుశలత, ప్రజ్ఞా విశేషాలు ప్రశంసా పాత్రములయినవి.

శ్రీ వినోబాభావే ప్రజల నైతికస్థాయి ఉత్తమంగా నుండాలని ఆశించడం మంచిదే. తగ్గుముఖంగానున్న నైతిక సంపద పెరుగుదలకు ప్రజల సహాయ సహకారములను సమీకరించడం అభినందించ తగినది.

భూదాన, సంపద్దాన యాత్రల సందర్భమున శ్రీ వినోబాభావే ప్రజల నైతికస్థాయిపట్లగూడ ప్రత్యేకాసక్తి చూపగలరనే ఆశిద్దాం!

---

# దౌర్జన్యాలకు కారణం

విద్యా విధానం, పార్టీ రాజకీయాలు దౌర్జన్యాలకు కారణమని ఆచార్య వినోబా అభిభాషణ ప్రస్తుత విద్యా విధానము లోపభూయిష్టమయినదను విషయము అందరికీ తెలుసు. కాని సంస్కరించడానికి, ఉపయుక్తమయిన విధానమును రూపొందించడానికి ప్రయత్నాలు ఎందుకు జరుగలేదో - ఎప్పుడు జరుగుతవో దురూహ్యం.

విద్యా విధానం రేపు పౌరుడుగా రూపొందనున్న యీ నాటి విద్యార్థిలో ఆత్మ విశ్వాసాన్ని, జీవన సమస్యలలో భద్రతను సమకూర్చలేకయున్నది. పోనీ సమరస సద్భావములను, పరస్పర సహకారమును, విశాల దృక్పథాన్నైనా విద్యార్థులకు పూరించుచున్నదాయనిన అదియు అనుమానాస్పదమే.

విద్యార్థులు తాము చదివే చదువు ఏమిచదువుతున్నారో, ఎందుకు చదువుతున్నారో, దానివల్ల తాము సాధించనున్న ఘనత ఏమిటో వారికి తెలియదు. వర్గ విభేధాలకు అతీతంగా విద్యార్థులలో ప్రస్తుత విద్యా విధానము సౌభ్రాతృత్వాన్ని అలవర్చలేకున్నదను విషయము వాస్తవము.

పార్టీ రాజకీయాలు దౌర్జన్యానికి కారణమనుమాట వాస్తవమే. కాని ఏపార్టీ కాపార్టీ ఉద్దేశానికి, అభూయిత్వానికి లోనుకాకుండా ఎవరి విధానాలను, నియమావళులను వివరించుకొంటూ ప్రజలను ఆకర్షించుకోడం కొంతవరకు దౌర్జన్యాలకు విరుగుడు. వ్యక్తిగత దూషణలు, అసభ్య ప్రచారములు, అసత్య నిందలమోపడం గౌరవప్రదంకాకపోగా ప్రజలలో శాంతి భద్రలకుకూడ ముప్పంరాగలదు. కాబట్టి పార్టీ రాజకీయాలు సయితం విశాల దృక్పథంతో వ్యవహరిస్తే దౌర్జన్యాలు కొంతవరకు నిరోధించబడవచ్చును.

మొత్తంమీద దౌర్జన్యాలు నిరోధించబడాలి. అందుకు విద్యా విధానం, పార్టీ రాజకీయాలు సయితం క్రమబద్ధమైన మార్గమును అనుసరించాలి.

# ఈశావాస్యోపనిషదు

పూజ్యపాద శ్రీ స్వామీ చిన్మయానందజీ.

ఉపనిషదులు

(గతసంచిక తరువాయి)

విద్యాం చావిద్యాంచ యస్తద్వేదో
భయం సహ ।
అవిద్యయా మృత్యుం తీర్త్వా విద్యయా
మృతమశ్నుతే ॥౧౧॥

విద్యను, అవిద్యను, ఏకకాలమున తెలిసియుండు నతడు అవిద్యవల్ల మృత్యువుని అతిక్రమించి, విద్య వల్ల అమృతత్వమును పొందుచున్నాడు.

"అకర్మయందు కర్మను" ప్రతిపాదించు సిద్ధాంతమును తెలుపుటకై ఋషులు ఈ గంభీర అర్థముగల శ్లోకమును తమ ఆన్యతరమువారికి ప్రసాదించియున్నారు. ముందు శ్లోకములో, విద్య, అవిద్య రెండును అంధకారమున చేర్చుచున్నదని వీటి యొక్క ఒకదాని ప్రత్యేక ఆచరణను ఖండించియున్నారు. అటుపిమ్మట వాటి రెంటియొక్క సమ్మిళిక ఆచరణను విమర్శించుచు, పూర్వఋషుల అభిప్రాయములను తెలుపుచు అందలి సారమును ప్రకటించుచున్నారు. వీటిని, యొక్కొక్కటి, ప్రత్యేకముగా ఆచరించ కూడదనిన, రెంటిని, విద్యను అవిద్యను సమ్మిళితముగా ఆచరించవలెనని శిష్యునికితోచగలదు. విషయవ్యవహార కర్మయు, దైవసంపత్తు జ్ఞానమున్ను, సమ్మిళిత ఆచరణీయమని నవీన బోధకులుకూడ సూచించి యున్నారు. కాని ఆచరణీవిధానము మాత్రము తెలిపియుండలేదు. ఇచ్చట ఈ ఉపనిషదునందు ఆ విషయముకూడ, సందేహనివారణ పూర్వకముగా, చక్కని భాషతో, శాస్త్ర సమ్మత వాక్యములతో తెలుపబడి యున్నది. ఇచ్చట, ఎవడైతే, విద్యను, అవిద్యను, తనయందు జతపరుచగలిగియున్నాడో, అతడు అవిద్యవల్ల మృత్యువుని అతిక్రమించి, విద్య వలన అమృతత్వమును పొందుచున్నాడు అని తెలుపబడియున్నది.

ప్రస్తుతకాలము, సాంఘిక, వర్ణగత, జాతీయ, అంతరజాతీయ విషయములలో ఉద్రేకవ్యవహారములుకూడియున్నవి. చాలమంది కర్మనే ఆమోదించు అంధులున్నారు. ఒకడు తప్పిన ఒకడు నాయకుడుగానున్నాడు. నాయకుడుగా లేనివాడు త్వరలోనే నాయకత్వము స్వీకరించ ఉవ్విళ్లూరుచున్నాడు. ఇట్లు ఇంతమంది నాయకులుండియు, వీరందరి నాయకత్వ ఫలముగా ప్రపంచము ఎగబోసుకొనుచు, భీతినుండి, దిగ్భ్రమను, నిరాశనుండి, నాశనమునకు కాలు జారకొనిపోవుచున్నది. జ్ఞానవంతులుకూడ ఈ పరిస్థితిని గమనించి ఆశ్చర్యపడుచున్నారు. దీని యొక్క నిర్ణయము, ఇందుకు తగుచికిత్సకూడ ఈ అర్థగర్భమైన మంత్రమున అగాధరహస్యములో నెలకొని యున్నది.

విద్యలేనిది బాహ్య అవిద్యాప్రపంచమున వ్యవహరించుట సాధ్యముకాదు. అట్టికార్యము లాభకరము కూడకాదు. సమష్టి బ్రహ్మ నిర్మాణ సమత్వము, చక్కని అమరిక తెలియక, ద్వంద్వములనంత ఐక్యము చేయు శక్తినిగమనించక, నానాస్వరూప ప్రపంచమున వ్యవహరించుటవల్ల, ప్రపంచమునందలి అల్లరి పెరుగుటకు హేతువగుచున్నది. కృషీవలు నాయకులు ప్రపంచమున, సమత్వము, శాంతము, ఆనందము నెలకొల్ప కష్టపడుచున్నారు. కాని వారు స్వయముగా వీటిలో దేనిని అనుభవించి యెరుగలేకున్నారు. శృతిసమన్వితముకాని వాయిద్యమును చేతబట్టుకొని, మహావిద్వాంసుడు కూడ చక్కని రాగమును కల్పించలేడు.

ఈ శ్లోకము, ఆత్మజ్ఞానము మనకు శాశ్వత మోక్షమును, అమరత్వమును కల్పించుచున్నదని తెలుపుచున్నది. అందువలన, దుష్టమరణము అను అవస్థగల ఈ శరీర మనో బుద్ధుల సమూహము మన స్వరూపముకాదు అని తెలియుచున్నది. ప్రకృతి విషయ సమూహమునకు మరణము అనివార్యము. జీవునికి అమరత్వపదప్రాప్తియే ముగింపు.

కాని ఈ జన్మమునందే "విద్య" సంపాదించుకొని, ముక్తిపొందిన జీవులు, ప్రైగంబరులు, దైవమానవులుకూడ కొంత జీవిత కాలము గడుపవలసి యున్నది. అట్టివారికి, అందుపైని, రహస్యముగా ఒకగుహలో కూర్చుని తన ఆత్మసాక్షాత్కార ఆనందానుభవమును గ్రోలుచుండుట ధర్మము కాదు. అందుకు వ్యతిరిక్తముగా, తన బాహ్యప్రపంచ వ్యవహారములవల్ల, తన ఆత్మసాక్షాత్కారము పూర్తి చేసుకొనవలసి యున్నది. ఇంతకముందు 6. 7 శ్లోకములతో ఆత్మసాక్షాత్కారము తనయందలి ఆత్మయే దివ్యమైనదని అనుభవించుటకాదు. ఆ సాక్షాత్కారము, తనయందలి ఆత్మయే అన్నిటి యందును యున్నదని అనుభవించుటలో పూర్తియగుచున్నది. మన ఆత్మానుభవమున, అపరిపూర్ణద్వంద్వ ప్రపంచమును కలుపుకొనక పోయిన, అట్టి సాక్షాత్కారము పరిపూర్ణముకాజాలదు. జీవన్ముక్త మహాపురుషుడు. ఋషి, తన జ్ఞానమునందే స్థిరముగా నిలిచినవాడై, ప్రపంచమున కంతయు, జయమును, అమిత ప్రకాశపదవిని ఒడగుర్చ శక్తివంతుడగుచున్నాడు.

ఇట్లు, ఏమానవుడు మానవరాశిని, సంస్కరించి, ఉన్నత జీవిత ఆశయములతో పూరింప కృషి చేసియున్నాడో, అట్టివానిని ప్రపంచమంతయు శాశ్వతముగ స్మరించుచున్నది. ఇట్లు మానవకోటిలో సేవచేసిన జ్ఞానఘనులు భూమండలమున, జనులం శాశ్వత కృతజ్ఞతకు పాత్రుడగుచున్నాడు. ఇట్లు, బుద్ధుడు, క్రీస్తు, శంకరులు, మహమ్మదు, జోరాస్టరు మొదలగు మర్త్యులు, సర్వభక్షకుడగు మరణమును సునాయాసముగ ఎదిరించి, కీర్తిశేషులయియున్నారు ఈ మహాపురుషులు, తమ కాలపు జనసంఘము సర్వత్ర ప్రవేశించి, తమతరమువారి వల్లనేగాక, శాశ్వతముగా, ఆయామతములయందు స్మరింపబడుచున్నారు. ఇట్టివారు చరిత్రయందు కృతజ్ఞతా పూర్వకముగా స్మరింపబడుట యటుండ, వారు తమ అవిద్య - అజ్ఞానశక్తివల్ల మృత్యువునిజయించ గలిగిరి. ఇట్టి కార్యమునకు ఆధారశక్తి వారి జ్ఞానము లేక విద్య! మరణము. దానిని తలచి భయపడువారికి, ఘోరముగా కానబడును. ఆ మరణము యొక్క నిజస్వరూపమును తెలుసుకొనిన మహనీయునికి, ఈ విషయవస్తువులయందు కలుగుమరణము అను మార్పువల్ల ఎట్టిభయముగాని, కంపముగాని జనించదు. ఈ దేహమే నేను అని తలచువానిని మరణము భయపెట్టగలదు. నేను ఆత్మ అని తెలిసినవానికి, మరణము అనునది ఈ శరీరములో కలుగు ఒక మార్పుగానుండును. తన అజ్ఞానదశలో ఈ దేహమునిూద కొంతమమకారముండెను. కాని ఇపుడు అది తొలగినదికాబట్టి మరణమునకు తనకు ఎట్టి సంబంధము లేదు.

"విద్యవలన అమృతత్వము పొందును" మరణించునది ప్రకృతి వస్తువులు. ఆత్మకు అట్టిదశలేదు. ఘటము పగిలిన ఘటాకాశము లేక పోవచ్చును. కాని ఘటములోని ఆకాశము పగులను లేదు. పుట్టను లేదు. అది సర్వవ్యాపక ఆకాశము. ఎల్లపుడు ఒకేరీతిని యుంటున్నది. ఇటులనే, జననము మరణము. క్షయము, వ్యాధి, బంధము, మోక్షము, దుఃఖము, సుఖము, జయము, అపజయము ఇవన్నియు, అహంకార ఆవరణలో అనుభవములు కలుగుచుండును. ఎందుకనగా, శుద్ధజ్ఞాన ఆత్మ, ప్రకృతి ఆవరణములలో ప్రవేశించి, దృష్టించుటవల్ల భ్రమకలిగి, వీటి అనుభములను తాను పొందుచుండును. ఆత్మ - సాక్షాత్కార అనుభవముతో, అజ్ఞాన, అహంకారము నాశమగుచున్నది.

మర్త్యుని, అహంకారము తొలగించిన, అమరుడగుచున్నాడు. ఇందువల్ల సాధకుడు అహంకారమును పూర్తిగ శరణాగతిగ సమర్పించిన, ధన్య మార్గమువల్ల దేహమనోబుద్ధులయందు తాదాత్మ్యమును తొలగించిన యెడల, తన శుద్ధ ఆత్మస్వరూపమును పునర్దర్శనము పొందుచున్నాడు. (4 5, 8, శ్లోకములలో తెలుపబడినట్లు) అట్టివానికి అటు పిమ్మట, పునర్జన్మము లేదు. అతని కర్మలు అతనిని సంసారచక్రమున బంధించుట లేదు. అందువలన అతడు తన అనుభవములోనున్న మర్త్యత్వము తొలగించుకొని, అమరుడగుచున్నాడు.

అన్ధం తమః ప్రవిశన్తి యే౽సంభూతిము పాసతే,
తతో భూయ ఇత తే తమో య ఉ సంభూత్యాం రతాః ॥౧౨॥

అవ్యక్తమును బ్రహ్మ ఉపాసించువారు అంధకార చీకటియందు పడుచున్నారు. వ్యక్త (బ్రహ్మ)ను ఉపాసించువారు ఇంతకన్న గొప్పది గానగుపడు చీకటియందు పడుచున్నారు.

ముందు తెలుపబడిన విషయములనే (9 10,11 శ్లోకముల యందలిది) విపులముగా తెలుపుటకై మరల ఈ 12, 13, 14 శ్లోకములు ఉపయోగింపబడుచున్నవి. బహుశా దయామయుడైన గురువు, ముందటి మూడు శ్లోకములయందలి విషయములు కడు సూక్ష్మమైనవి. ఒక్కతూరి తెలిపినంతనే శిష్యులు తెలుసుకొనలేరని నమ్మియున్నాడు. మరియు, ఈ విద్య, అవిద్యకు గల పరస్పర సంభందము వేదాంతవిచారులు గనుక అవశ్యము బాగుగ తెలుసుకొనవలసిన అగత్యమున్నది.

ఈ విద్య - అవిద్య పరస్పరము విరోధము వ్యతిరిక్తము కాదనియు, ఒకదానివల్ల యొకటి నశింపజాలవనియు, రెంటిని తారతమ్యము లేక సమ్మేళనము చేయరాదనియు, ముందు శ్లోకములలో తెలుపబడియున్నది. అవి పరస్పరము అనుకూలములయినవనియు, ఒకటి వెనుక యొకటి అనుసరింపయోగ్యములనియు కూడ తెలుపబడినది. మొదట, అవిద్య, కర్మరూపముగా, కోరికలవల్ల ప్రేరింపబడి, మన తామసగుణమును, మానసికవ్యవహార ఉరవడియగు రజోగుణముగా మారుచున్నది. పిమ్మట, నిష్కామ్య కర్మ వలన, మనోబుద్ధుల స్థైర్యత్వతగాంచి, ధ్యానమునకు యోగ్యత సంపాద్యమగుచున్నది. అటు పిమ్మట, నిరంతర చక్కని ధ్యానమువలన, సాధకుడు విద్య — జ్ఞానసంప్రాప్తమును పొందుచున్నాడు. ఈ విషయభావమునే, విద్య అవిద్యకు బదులు వేరు పదములు ఉపయోగించి, వర్ణించబడుచున్నది.

ఇచ్చట ఉపయోగింపబడిన పదములు అవ్యక్తము. సంభూతి. అవ్యక్తమును, నిరాకార బ్రమనియు, వ్యక్తమును సాకార బ్రహ్మమనియు తెలిపినబాగుగా తేటపడవచ్చును. భక్తులయందు సాకార బ్రహ్మను ఉపాసించుటా నిరాకారబ్రహ్మను ఉపాసించుటా అను సమశ్య శాశ్వతముగా తర్కము జరుగుచుండును.

వేదాకాలమునందుకూడ సాకార దేవతలు వాయువు, అగ్ని, వరుణము మొదలగు పేర్లు వాడకలో యుండెను. పురాణకాలమునందు రామ, కృష్ణ, స్కంద, అనునవి యుండెను.

ఈ వివాదము మన కాలములోకూడ వ్యాపించియున్నది. జ్ఞానము భక్తి, అనువాటిలో ఏది గొప్ప అను వివాదము జీవితాచరణమున గొప్పసమశ్యగా కనబడుచున్నది. ఈ ఉపనిషదు, ఇట్లు మన వివాదములన్నియు, అర్థము ఆధారము లేనివి అని తెలుపుటకు తగు సత్య సూత్రములను ప్రకటించుచున్నవి. విద్య, అవిద్య వ్యతిరేకము కావనియు, ఒకటికొకటి అనుకూలములనియు ముందు తెలిసినట్లు, భక్తి, జ్ఞానము రెండును వ్యతిరేకములు కావు. ఒకటి ప్రక్కన యొకటి వృద్ధిపొంది, స్థిరత్వము గాంచుచున్నవి.

అన్యదేవాహుః సంభవాదన్యదాహురసంభవాత్ ।
ఇతి శుశ్రుమ ధీరాణాం యేనస్తద్విచచక్షిరే ॥౧౩॥

వ్యక్తమును ఉపాసించుటవలన ఒకఫలము కలుగుచున్నదని చెప్పుచున్నారు. అవ్యక్తోపాసమువలన వేరు వస్తువు ప్రాప్తమగుచున్నదని చెప్పుచున్నారు. ఇట్లుజ్ఞానఘనులు మాకు ఉపదేశించగా వినియున్నాము.

ముందటి మూడు శ్లోకములలో రెండవ శ్లోకమునందు ఋషి తెలిపినట్లే వ్యక్తము అవ్యక్తము అనునది మనము తలచుచుండు భావములుకాదు. వాటికి విశేషభావములు కలవు అని తెలుపుచున్నారు. ఈ నూతనవిశేషభావము, తనస్వకపోల సృష్టివలన లభించినదికాదు. తమగురు పరంపరగా శిష్యులకు భోదింపబడిన వ్యాఖ్యానమునియు తెలుపుచున్నాడు.

సంభూతించ వినాశంచ యస్తద్వేదోభయంసహ ।
వినాశేన మృత్యుం తీర్త్వా సంభూత్యామృతమశ్నుతే ॥౧౪॥

ఎవడైతే అవ్యక్తబ్రహ్మను, వ్యక్తబ్రహ్మనుకూడ ఉపాసించుచున్నాడో, అతడు, వ్యక్తబ్రహ్మ ఉపాసనవల్ల, మృత్యువును అతిక్రమించి, అవ్యక్తబ్రహ్మ ఉపాసనవల్ల అమృతత్వమును పొందుచున్నాడు.

ముందట మూడు శ్లోకములలోని కడపటి శ్లోకములో తెలిసిన విషయమే, పదముల మార్పుతో, తెలుపబడుచున్నది. విద్య, అవిద్య అను పదములకు బదులు, వ్యక్తబ్రహ్మము అవ్యక్త బ్రహ్మము అని వాడబడుచున్నది. ఈశ్లోకమునందు ముందు శ్లోకమున తెలిపిన భావమును తెలుపుటయేగాక, కొన్ని అర్థగాంభీర్య విశేష సూచనలు కలిగియున్నవి.

ఈ మంత్రము వల్ల భక్తి, జ్ఞానములయందు గల తర్క వ్యవహారములు వృథా, నిష్ప్రయోజనములని స్పష్టముగా తెలుపబడియున్నది. ఇవిరెండు వ్యతిరేకములు కావు. రెండు అనుకూల గుణములుకలవి. ఒకదానివెనుక యొకటి అభ్యసముచేయుట క్రమము అని తెలుపబడుచున్నది. ఉన్నత ధ్యానమునకు నామరూపములుగల దేవతను ఉపాసించుట ఆవశ్యకము. అటులనే, ఆత్మసాక్షాత్కారమునకు, నిరంతర తీక్ష్ణ నిరాకార బ్రహ్మ ఉపాసన ఆవశ్యకము. చక్కని భక్తి, జ్ఞాన సమ్మిళిత ఉపాసనవల్ల మరణ దుఃఖములను తరించగలుగుచున్నాము.

(సశేషము)



# త్యాగమూర్తి

(కుమారి సుందరి)

దివిజుల తృప్తికై పసుల తియ్యని జీవితముల్ నశింపఁగా,
నవిరళ రక్తధారలు మహానదులై ప్రవహించు వేళలో,
నవని జనించి "భూతదయ" కర్థముఁ దెల్పితి బుద్ధదేవ! నీ
సువిమల బోధనల్ హృదయ శూన్యులనైనఁ జలింపఁ జేయఁగన్,

ఎందరు లేరు రాజసుతు, లెందరు తేలరు భోగవార్ధిలో,
నందరు కాలగర్భమున నైక్యముఁ జెందరె? ప్రాణికోటికై
యందిన రాజ్య సంపదల, నాత్మజుఁ, బత్నిఁ ద్యజించి కాననం
బందుఁ దపించి యెవ్వఁడలరారెను నీ క్రియఁ ద్యాగమూర్తియై?

క్షణిక సుఖమ్ముఁ గోరి నిజగౌరవమెల్ల నశించు రీతిఁగా
ననుదినమేఁగుచున్న తన యాయువు పోకడఁ గాంచకే మహా
ఘనతర బంధనమ్ములను గైకొను దీన మనుష్య జాతినిన్
గని చలియించి నీ హృదయనాళులు నాట మొనర్చెనా? ప్రభో!

తల్లియుఁ దండ్రి యన్న మమతన్ మదినెంచిన మోహబద్ధులన్,
నల్లలితాంగులన్ దవిలి సత్కృతి నెంచని కామచిత్తులన్,
ప్రల్లదమొప్ప రక్తమును బాఱఁగఁ జేసిన ఖడ్గహస్తులన్
జల్లని బోధనామృత మొసంగి యొనర్చితె శాంతి దూతలన్.

నీ సిద్ధాంతము నిత్యమై పరఁగె, నీ నిష్కల్మష త్యాగమే
వాసింగాంచె జగమ్ములో, నృపులె నీ పాదాబ్జ సంసేవకై
యాశం జెందిరిగాదె, నీదు చరితమ్మా చంద్రతారార్కమై
ప్రాశస్త్యమ్ముగనె, న్నమస్కృతులు దేవా! శాంతి సంస్థాపకా!



# భారతదేశంలోని ప్రముఖ బౌద్ధక్షేత్రాలు



(భారత ప్రభుత్వ సమాచార రేడియో మంత్రిత్వశాఖ ప్రచురించనున్న "౨౫౦౦ సంవత్సరాల బౌద్ధమత చరిత్ర" అనే గ్రంథంలోని "భారతదేశంలోని బౌద్ధక్షేత్రాలు" అనే అధ్యాయం ఆధారంగా యీ వ్యాసం రచించబడింది.)

గౌతమ బుద్ధుడు పరినిర్వాణం చెందకముందు బౌద్ధమతంపట్ల ప్రేమ విశ్వాసాలుగలవారు దర్శించవలసిన క్షేత్రాలు నాలుగువున్నాయని చెప్పారు. అవి ఇవి:-లుంబినీవనం - ఇది తాతగారి జన్మస్థలం. గయ - బోధ్‌గయ - ఇక్కడ ఆయన జ్ఞానసిద్ధిని పొందారు. ఇసిపట్టణంలోని వేళ్లవనం - సర్నాథ్, కుశినగరం.

పైనాలుగుగాక బౌద్ధమత ప్రాముఖ్యంగల స్థలాలు భారతదేశంలో మరో నాలుగువున్నాయి. శ్రావస్తి, శంకాస్య, రాజగృహ, వైశాలి.

## లుంబిని

బౌద్ధమహా పుణ్యక్షేత్రాలలో అతిముఖ్యమైనది లుంబిని. అది గౌతమ బుద్ధుని జన్మస్థలం. నేపాలులోని రుమ్మిండై అనే ప్రాంతమే లుంబిని అని నిర్ధారించబడింది.

గౌతమ బుద్ధుని జన్మస్థలంకావున దీనికి ఎక్కువ పవిత్రత, ప్రాముఖ్యం చేకూరాయి. అక్కడ అనేకమైన కట్టడాలు, స్థూపాలు వెలిశాయి. అశోక చక్రవర్తి అక్కడికి యాత్రవచ్చినట్లుగా అక్కడ యిప్పటికీ ఒక శాసనంవున్నది.

"బుద్ధుని జన్మస్థలం ఇదే" అని అశోకుడు చెప్పినట్లుగా అందులోవున్నది. ఇదేగాక అక్కడ ఒక ప్రాచీన మంటపం ఒకటివున్నది.

## బోధ్‌గయ

బుద్ధుడు జ్ఞానసిద్ధిని పొందిన బోధ్‌గయ-గయకు దక్షిణంగా ఆరుమైళ్ల దూరంలోవున్నది. పవిత్రమైన బౌద్ధపీఠాలు, స్థూపాలు యిక్కడ ఎక్కువగా వున్నాయి. చైనీస్ యాత్రికుడు యువాన్‌ఛాంగ్ యీ స్థలంయొక్క వైభవాన్ని గొప్పగా వర్ణించి, బోధమండపాన్ని అశోక సార్వభౌముడు నిర్మించాడని పేర్కొన్నాడు.

కాని ఆ మంటపంయొక్క జాడకూడ యిప్పుడు కన్పించడంలేదు. ఇప్పుడు అక్కడవున్న పెద్ద కట్టడం యిటీవల నిర్మించబడినట్టిది. యీ దేవాలయం అనేకసార్లు పునరుద్ధరించబడింది. బర్మాలోని మహాబోధి దేవాలయం యిదే విధంగా వుంటుంది.

ఈ దేవాలయానికి చుట్టూ శిధిలావస్థలో అనేక కట్టడాలున్నాయి. వాటిని పరిశీలిస్తే రెండు రకాల నిర్మాణ పద్ధతులు ద్యోతకమవుతాయి. మొదటిది క్రీ. పూ. రెండవ శతాబ్దంనాటిది. రెండవది గుప్త రాజుల కాలంనాటిది. ఈ స్థంభాలమీద అందమైన చెక్కడపుపని కనిపిస్తుంది. ఈ క్షేత్రం యాత్రికులను విశేషంగా ఆకర్షిస్తున్నది.

## సర్నాథ్

బౌద్ధమతంయొక్క జన్మస్థలంయిది. అందువల్ల ఇది బ్రహ్మాండమైన బౌద్ధక్షేత్రమయింది. షుమారు సహస్రవత్సరములుపాటు యీ స్థలం అతిప్రాముఖ్యంలోవున్నది. బౌద్ధమతం వ్యాప్తిలోకివచ్చిన తొలి శతాబ్దాలలో లేళ్ళవనం సంగతి ఎక్కువ తెలియకపోయినా అశోకుని కాలంనుంచి యీ స్థలం ఎక్కువ ప్రసిద్ధిలోకివచ్చింది. కాశీనుంచి సర్నాథ్ వైపుకు వెడుతూవుంటే ఇటుకతో నిర్మించబడిన ఒక దిబ్బ కనిపిస్తుంది. అది శిధిలావస్థలోవున్న ఒక

బౌద్ధస్తూపం. గౌతమ బుద్ధుడు గయనుంచి ఇసి పట్నానికి వెళుతూ తన అయిదుగురు పూర్వ సహచరులను అక్కడ కలుసుకొన్నారు.

ఉత్తరంగా ఒక అరమైలు దూరంలో శేర్లవనం వుంది. అక్కడ మొదట్లో అనేక అందమైన భవనాలు వుండి వుండాలి. ఇప్పటికీ అక్కడ ధామేఖ్ స్థూపం ఒకటి వున్నది. భారత ప్రభుత్వ భూగర్భ పరిశీలనశాఖవారు జరిపిన పరిశీలనల ఫలితంగా అనేక బౌద్ధ విహారాలు, స్థూపాలు, కట్టడాలు, బయట పడ్డాయి. అశోకుని కాలంనుంచి వివిధ రాజుల కాలంలో నిర్మించబడిన కట్టడాలు ఇవి.

ఇటుకతో నిర్మించబడిన ఒక పెద్ద స్థూపం ప్రస్తుతం శిథిలావస్థలోవున్నది. అదే అశోక స్థూపం. మామూలుగా దానిని జగత్ సింగ్ స్థూపం అని పిలుస్తారు. కాశీరాజు చైత్ సింగ్ యొక్క దివాన్ జగత్ సింగ్ పేరున అది పిలువబడుతున్నది.

గౌతమ బుద్ధుడు తొలి చర్చను యిక్కడ ప్రారంభించి న్యాయచక్రాన్ని త్రిప్పడం యిక్కడే ప్రారంభించాడు. దీనికి కొంచెం ఉత్తరంగా అశోక స్తంభం వున్నది. తూర్పువైపున శిథిలమైన ఒక దేవాలయం వున్నది. అది గుప్తరాజుల కాలంలో నిర్మించబడింది.

మహాబోధి సొసైటీవారు, యిక్కడ మూలగంధ కూటి విహారాన్ని నిర్మించారు. తక్షశిల, నాగార్జున కొండ, సింధులోని మిర్పూర్‌ఖాస్‌లలోని బౌద్ధ శిథిలాలను అందులో భద్రపరిచారు. శిల్పఖండాలు ముద్రలు, శాసనాలు, మట్టిపాత్రలు అనేకం అక్కడ త్రవ్వడాలనుంచి బయటపడ్డాయి. కొన్ని వస్తువులు మినహాగా, మిగతావన్నీ ౧౫౦౦ సంవత్సరాలనాటి అంటే క్రీస్తు పూర్వం మూడవ శతాబ్దంనుంచి క్రీస్తు తర్వాత ౧౨వ శతాబ్దంవరకూగల చరిత్రను చాటుతున్నాయి. అశోక స్తంభంపైన సింహం మ్యూజియం హాలులో భద్రపరచబడివున్నది. అందులోని వస్తువులలో కెల్లా అతిముఖ్యమైనది ధర్మచక్ర ప్రావర్తన ముద్ర.

## కుశినగరం

కుశినగరంలో గౌతమ బుద్ధుడు తన పద్దెనిమిదవ ఏట నిర్వాణాన్ని సాధించారు. ఉత్తర ప్రదేశ్ లోని గోరఖ్‌పూర్ జిల్లాలోని కాశియా అనే స్థలమే యీ కుశినగరమని చెప్పబడుతున్నది.

## శ్రావస్తి

ప్రాచీనకోసల రాజధాని శ్రావస్తి. బౌద్ధులకు అతి ముఖ్యమైన క్షేత్రం, ప్రసన్నజిత్తురాజు ఎదుట గౌతమ బుద్ధుడు అనేక మహాత్కార్యాలను చేశాడు. బుద్ధుడు వెయ్యిరేకులుగల పద్మంపై కూర్చుని అనేకమైన ప్రతిరూపాలను సృష్టించగా అందరూ ఆశ్చర్యపోయారు.

## సాంకస్య

ఉత్తర ప్రదేశ్‌లోని ఎటా జిల్లాలోవుంది యీ స్థలం. గౌతమ బుద్ధుడు తన తల్లికి యితర దేవుళ్లకు అభిధర్మాన్ని బోధించడానికి ప్రయత్నింప స్వర్గానికి వెళ్లి తిరిగి భూలోకానికివచ్చాడు. స్వర్గానుంచి తిరిగివస్తూ భూలోకంలో యీ స్థలంమీద ముందు కాలు పెట్టాడు.

## రాజగృహ

రాజగృహ పాట్నా జిల్లాలోని ఆధునిక రాజ్ నగర్ - మగధ రాజధాని. అది బౌద్ధులకు అతి పవిత్రమైన క్షేత్రం. దేవదత్తుడు గౌతమ బుద్ధుని హత్యచేయడానికి యీ స్థలంలోనే అనేకసార్లు ప్రయత్నించాడు. ఇక్కడగల సప్తపర్ణిగుహాలలో పరినిర్వాణ అనంతరం తొలి బౌద్ధ సంఘం సమావేశమైనది. ప్రాచీన కాలంలో యిది ప్రముఖ జైన మత కేంద్రంగాకూడ ప్రసిద్ధి చెందింది. జైన మతానికి సంబంధించిన అనేక కట్టడాలు, స్థూపాలు యిక్కడ శిథిలావస్థలోవున్నాయి.

## వై శా లి

వైశాలీనగరం తొలి రోజులలో ప్రసిద్ధికెక్కిన బౌద్ధ క్షేత్రం. గౌతమ బుద్ధుడు తన జీవితకాలంలో యీ క్షేత్రాన్ని ముమ్మారు దర్శించాడు. గౌతమ బుద్ధుడు ఒకసారి అక్కడికి వెళ్లినప్పుడు ఒక వానర దళమాయనకు ఒక గిన్నెలో తేనెను సమర్పించాయట. నిర్వాణానంతరం 100 సంవత్సరాలు తర్వాత బౌద్ధ సంఘం రెండవ సమావేశం యిక్కడ జరిగింది. జైనులకుకూడ వైశాలి గొప్ప పుణ్యక్షేత్రం. మహావీరుని జన్మస్థలం యిది.

## సాం చీ

గౌతమ బుద్ధుని జీవితంతో ప్రత్యక్ష సంబంధం లేకపోయినా ముఖ్యమైన విహారాలు, స్థూపాలుగల బౌద్ధ క్షేత్రాలు ఎన్నో వున్నాయి. అందులో సాంచీ ఒకటి.

సాంచీ ఢిల్లీకి 436 మైళ్ల దూరంలోవున్నది. భారతదేశంలో బౌద్ధ స్థూపాలు అసంఖ్యాకంగాగల క్షేత్రం సాంచీ. బౌద్ధ గ్రంథాలలో సాంచీ పేరు చెదురుగా కన్పిస్తుంది. సాంచీలోని బౌద్ధ స్థూపాలు అశోకుని కాలంనుంచీ కన్పిస్తాయి.

## న లం ద

బౌద్ధమతం చివరికాలంలో అతిప్రాముఖ్యాన్ని చెందిన క్షేత్రాలలో నలంద ఒకటి. బుద్ధుడు యీ క్షేత్రాన్ని అనేకసార్లు దర్శించినట్లు, అశోకుని కాలంనుంచి ఇక్కడ బుద్ధ విహారాలున్నటు బౌద్ధ గ్రంథాలు చెపుతున్నాయి. నలంద ఆచార్యులకు పుట్టినిల్లు. ఆచార్య శీలభద్ర, సంతరక్షిత్త, దేసాంకార మొదలైనవారు అక్కడివారే. నలంద మహా విహారానికి ఆ విజ్ఞానులు అఖండకీర్తి ప్రతిష్టలను చేకూర్చారు. స్థూపాలు, విహారాలు, దేవాలయాలు శిథిలావస్థలోవున్నాయి.

## సౌ రా ష్ట్ర

సౌరాష్ట్రంలోని దక్షిణ ప్రాంతంలోను, ఆగ్నేయ ప్రాంతంలోను బౌద్ధకాలంనాటి గుహాలు అనేకం కనుగొనబడ్డాయి. అవి క్రీస్తు పూర్వం రెండవ శతాబ్దం నాటివి. జూనఘడ్‌లో ఒక పెద్దరాతి ఫలకం మీద బ్రహ్మలిపిలో ఒక శాసనంవుంది.

## గు జ రా త్

గుజరాత్‌లో కొంపిల్య అనే ఒక బౌద్ధమత కేంద్రం వుండేది. క్రీస్తు తర్వాత 367-వ సంవత్సరంలోని గుజరాత్ ప్రభువగు, దంతివర్మన్ కాలంలోని ఒక తామ్రశాసనంలో దంతివర్మ పురావీ నదిలో స్నానంచేసి, బౌద్ధభిక్షువు స్థిగమతి కోర్కెపై భూదానం చేసినట్లు చెప్పబడింది.

## దక్షిణ మహారాష్ట్ర

అశోకుని కాలంనుంచి మహారాష్ట్రంలో బౌద్ధ మతం ఎక్కువ వ్యాప్తిలోకివచ్చింది. భారతదేశంలోని బౌద్ధ గుహాలు మహారాష్ట్రంలోనే ఎక్కువ వున్నాయి. ఆ గుహాలలో సుందరమైన కుడ్య చిత్రాలున్నాయి. అందులో అజంతా గుహాలు చెప్పుకో తగ్గవి. అక్కడ మొత్తం 29 గుహాలువున్నాయి. రాతిని 100 అడుగులపరిమాణాల్చి గౌతమ బుద్ధుని జీవితానికి సంబంధించిన ఘట్టాలు, జాతక కథలకు సంబంధించిన ఘట్టాలు ఆ గుహాలలో చిత్రించబడ్డాయి. ఎల్లోరా గుహాలు ప్రపంచంలోకే అతి సుందరమైన గుహాలు. సింహాకారంగల ఒక సింహాసనంమీద ఆశీనుడైవున్న గౌతమ బుద్ధుని పెద్ద విగ్రహం అక్కడ చెక్కబడివున్నది.

## క ర్నా ట క

అశోకుని కాలంనుంచి కర్నాటకంలో బౌద్ధ మతం వ్యాప్తిచెందింది. స్థిగాపూరులోని బౌద్ధ స్థూపాలు అచ్చటి చరిత్రను చాటుతున్నాయి.

## ఆం ధ్ర

ఆంధ్రదేశంలోని ప్రసిద్ధిచెందిన బౌద్ధ స్థూపాలు అనేకచోట్ల కానవచ్చాయి. అంతకుముందు లేకపోయినా అశోకుని కాలంలో బౌద్ధమతం ఆంధ్రంలో బాగా వ్యాప్తిలోకివచ్చింది. వాణిజ్య వర్గాలవారు





ఎక్కువగా ముందుకువచ్చి బౌద్ధమతాన్ని స్వీకరించి నందున వారి ధనం బౌద్ధ స్తూపాల నిర్మాణానికి విని యోగించేవారు. కృష్ణా, గోదావరి లోయల్లో ఆ స్తూపాలు ఎక్కువగా కన్పిస్తాయి. ఉత్తరాన శాలిహుండంనుంచి దక్షిణాన చినగంజాంవరకు అనేక బౌద్ధ స్తూపాలు కన్పిస్తాయి.

గుంటూరు జిల్లాలోని అమరావతి, నాగార్జున కొండ, కృష్ణాజిల్లాలోని భట్టిప్రోలు, జగ్గయ్యపేట, గుడివాడ, ఘంటసాలలోని క్రీస్తు పూర్వం రెండవ శతాబ్దంనుంచి క్రీస్తు అనంతరం మూడవ శతాబ్దం వరకూ అనేక బౌద్ధ స్తూపాలు నిర్మించబడ్డాయి వీట న్నింటిలోకి ప్రాచీన స్తూపం భట్టిప్రోలు స్తూపం. అది క్రీ. పూ. రెండవ శతాబ్దంలో నిర్మించబడింది.

గుంటూరుకు పశ్చిమంగా 16 మైళ్ల దూరంలో వున్న అమరావతి ఆంధ్రంలోని బౌద్ధ క్షేత్రాలలో కెల్లా ముఖ్యమైనది. అన్నింటికంటే పెద్దదీ. ప్రసిద్ధ మైనదీ అక్కడి స్తూపమే. క్రీ. పూ. 150, 200 సంవత్సరాలలో నాగార్జునిచేత పెద్దదిచేయ బడింది. ఇది సాంచీస్తూపంకంటె పెద్దది. అమరా వతి శిల్పరీతులు సింహళానికి, ఆగ్నేయాసియాకు వ్యాపించాయి. ఇరవైఐదు సంవత్సరాలక్రింద ఈ స్తూపం బయటికి తీయబడింది. అది ఒక మహా స్తూపం. గౌతమ బుద్ధుని భౌతిక అవశేషం అక్కడ నిక్షేపంచేయబడింది. అశోకుని కాలంలో ఈ స్తూపంలో నిర్మించబడింది. క్రీ. వె. మూడవ శతా బ్దంలో బౌద్ధమతం ఆంధ్రలో ఎక్కువ వ్యాప్తిలోకి రావడానికి కృషిచేసిన శాంతిశ్రీ మొదలైనవారు ఈ స్తూపాన్ని అభివృద్ధి చేశారు.

అమరావతి శిల్ప పద్ధతులలో వందలాది కళా ఖండాలు రూపొందించబడ్డాయి. నాగార్జునకొండ ప్రాచీన నగరమైన విజయపురికి బౌద్ధకేంద్రంగా అంతర్జాతీయఖ్యాతిని పొందినట్లు స్థంభాల పైనవున్న శాసనాలు తెలుపుతున్నాయి. సింహళం, కాశ్మీరు, గాంధారం, చైనాలనుంచివచ్చే అనేక మంది బౌద్ధ బిక్షువులకు యిక్కడ అనేక విహారాలు నిర్మించబడ్డాయి.

## తమిళనాడు

చోళరాజుల కాలంలో మద్రాసుకు సమీపంలో వున్న నాగపట్టణంలో బౌద్ధకేంద్రం వుండేది. కంచిలో 100 బౌద్ధ విహారాలుండేవి. ఇక్కడ ఒక రాజ విహారంకూడ వుండేది.





# నిజం దేవుడెరుగు

మూలం : టాల్‌స్టాయ్

అనువాదం : దాసరి వెంకటకృష్ణయ్య

ఒక పల్లెలో ఎస్క్యనో ఒక చిన్న, అందమైన వ్యాపారి. ఒకసారి అతడు ప్రక్క నున్న పట్నంలో సంతకు బయలుదేరాడు. బేరపుసరకు బండిలో పెట్టి యిద్దరు నౌకర్లతో ప్రయాణమయ్యాడు. ఇంతలో అతని భార్య వచ్చి "మీరు యీరోజు సంతకి వెళ్ళొద్దు. రాత్రి నేను మీమీద పీడ కలకన్నాను" "నేను సంతలో మారి పడిపోతానని అనుకుంటున్నావా?" అన్నాడు.

"సంతనుంచి మీరు తిరిగి యింటికి వచ్చేటప్పటికి మీ తలమీది టోపీతీసి చూస్తే వెంట్రుకలన్నీ నెరసిపోయినట్టుగా కలగన్నాను. కాబట్టి మీరు యీ రోజు సంతకి వెళ్ళటం మానండి" అని బ్రతిమలాడింది ఎస్క్యనో భార్య.

"పిచ్చిదానా! ఎందుకట్లా భయపడతావ్! చూడు నేను తీసికెళ్ళిన సరకులన్నీ అమ్మి లాభంగడించి నీకు మంచి మంచి బహుమతులు తీసికువస్తాను" అని ఆమెతో చెప్పి, చంటిబిడ్డను ముద్దిడుకొని సంతకు బయలుదేరాడు.

సగందూరం పోయిన తర్వాత త్రోవలో అతని తోటివర్తకుడు అదే సంతకు పోతూ కలిశాడు. ఆ మాట యీ మాట మాట్లాడుకొంటూండగనే పొద్దుకూకింది. ఆ రోజు రాత్రికి వారిద్దరు ఒకే హోటల్లో భోంచేసి వేరువేరు గదుల్లో పండుకొన్నారు.

మరీ తెల్లవారిందాక పండుకోవటం ఎస్క్యనోకి అలవాటుకాదు. పొద్దెక్కక మునుపే బయలుదేరిపోతే మార్గాయాసం వుండదనే ఆలోచనతో తెల్లవారుఝామున నాలుగ్గంటలకే లేచి తన సామాను, నౌకర్లతో సహా బయలుదేరాడు ఎస్క్యనో. మధ్యాహ్నమయేసరికి ఒక గ్రామానికి చేరి ఒక సత్రంలో బసచేశాడు. ఇంతలో అకస్మాత్తుగా ఒక బండ్లోనుంచి పోలీసు ఆఫీసరు దిగి యిద్దరు బంట్రోతులతో ఎస్క్యనో దగ్గరకువచ్చాడు. వచ్చి అతని పేరు, ఎక్కడనుంచి ఎక్కడకి పోతున్నది, అతనితో ఎవరెవరున్నది అడగటం మొదలు పెట్టాడు. ఎస్క్యనో వీటన్నిటికి సావధానంగా సమాధానం చెప్పి "మీరు కాఫీ తాగుతారా?" అని అడిగాడు. పోలీసు ఆఫీసరు యిదేమీ వినిపించుకోకుండా "గడచిన రాత్రి ఎక్కడున్నారు? మీరు ఒక్కరేనా లేక మీతో పాటు మరో వర్తకుడు కూడా వున్నాడా? ఈ

రోజువుదయం మీరా వర్తకుని చూశారా? మీరు తెల్లవారకమునుపే ఎందుకు ఆ హోటలు వదలి వచ్చారు?'' ఇత్యాది ప్రశ్నలతో ఎస్కెనోని తికమక పెట్టాడు.

ఎస్కెనోకి ఈ విధంగా పోలీసు అధికారి ప్రశ్నలడగటం ఆశ్చర్యం కలిగించింది. చివరికి ''మీరు నన్నిప్రశ్నలడగటానికి కారణం? నేనేం దొంగననుకున్నారా! నా సొంత పనిమీద పోతున్నాను. మీరు ఈ విధంగా ప్రశ్నించటం బాగాలేదు''

''నేను ఈ జిల్లా పోలీసు అధికారిని. రాత్రి మీతో వున్న వర్తకుడు హత్య చేయబడ్డాడు. మీ సామాను సోదా చేయాల్సివుంది'' అని పోలీసు ఆఫీసరు కానిస్టేబిల్సుకు సోదా చేయమని చెప్పాడు. అతని సామాన్లన్నీ వెదకగా ఒకసంచీలోంచి రక్తపుమరకలుగల బాకు బయట పడింది.

''ఈ కత్తెవరిది? నీవే ఆ వర్తకుని చంపావు. దోషివి'' పోలీసు ఆఫీసరు గద్దించాడు.

ఎస్కెనో భయపడ్డాడు. తనకు తెలియకుండా రక్తముతో కూడిన కత్తి తనసంచీలో దొరికినందుకు.

''ఈ కత్తికి నెత్తురెందుకయింది?'' పోలీసు ఆఫీసరు ప్రశ్నించాడు.

ఎస్కెనో మాట్లాడలేక తడబడుతూ నత్తిగా ''నా...నాకు... తెలియదు... అ...ది, నాదికాదు''

''ఈ రోజు ప్రొద్దున ఆ వర్తకుడు పక్కమీదే చంపబడి వున్నాడు. నీవే ఆపని చేసివుంటావు. నీవు తప్ప అక్కడయింకెవ్వరూ లేరు. దానికి తోడు నీ సంచీలో ఈ కత్తి దొరికింది. నీ ముఖమే చెప్తుంది దొంగవని. నిజంచెప్పు – ఎందుకు ఆ వర్తకుని చంపినట్లు? ఎంత డబ్బు అతన్నుంచి దొంగిలించావు?'' పోలీసు ఆఫీసరు ప్రశ్నించాడు.

ఎస్కెనో నిర్దోషినని ప్రమాణం చేశాడు. అతను బయలుదేరబోయే ముందు అసలు ఆ వర్తకుని చూడనేలేదు. తనవద్ద అతని 8 వేల రూపాయిలు తప్ప యింకెవరి డబ్బూలేదు. ఆ కత్తిగూడా తనదికాదు. ఎస్కెనో ఎంత మొరపెట్టుకున్నా వినకుండా చేతులకు సంకెళ్లువేసి తీసుకొనిపోయారు. అక్కడికి సమీపంలోనున్న పోలీసు స్టేషనుకు తీసికొని పోయి ఎస్కెనోను అక్కడ నిర్బంధంలో వుంచారు.

ఎస్కెనో ఒకవర్తకుని చంపి అతని వద్దనున్న 20 వేల రూపాయిలను దొంగిలించినందుకుగాను అతని మీద కేసునిలిచింది. ఎస్కెనో భార్యకు ఈ విషయం

తెలిసింది. తెలిసి ఏమిచేయగలదు ? నిస్సహాయురాలు. తన పసిబిడ్డను తీసికొని జైలు అధికారివద్దకు పోయింది. ఆమెను లోనికి పోనివ్వలేదు. ఎంతో బ్రతిమలాడింది - వ్యర్థమయింది. తన పసి బిడ్డను చూపి ఆఖరుసారి తన భర్తను తన బిడ్డకు చూపమని బ్రతిమలాడింది. చివరకు అధికారుల అనుమతి తీసికొని వెళ్లింది ఎస్కెనో దగ్గరకు. ఇతర దొంగల్తో సంకెళ్లు వేసివున్న తన భర్తను చూచి పట్టరాని దుఃఖముతో మూర్ఛపోయింది. తెప్పరిల్లి ఎస్కెనో సమీపంలో ఇంటి దగ్గర తెనుకన్న పీడకల సంగతి జ్ఞప్తికి తెచ్చింది. ఎస్కెనో జరిగినదంతా పూసగుచ్చినట్లు భార్యకు చెప్పాడు.

"చూశారా! నేను చెప్పినట్టుగా మీ తలంతాగూడా ఎట్లా తెల్లగా మారిందో! నేను చెప్పలా ఆ రోజు సంతకి పోవద్దని." అంటూ అతని తలనిమురుతూ "మీ భార్యతో నిజంచెప్పండి - దైవసాక్షిగా యీనేరం మీదికాదా?" అని ప్రశ్నించింది మెస్కెనో భార్య.

"నీవు కూడా అనుమానిస్తున్నావా నన్ను" అన్నాడు మెస్కెనో పట్టరాని దుఃఖముతో తల చేతుల్లో దాచుకొని.

ఇంతలో పోలీసులువచ్చి ఆమెను వెళ్లిపొమన్నారు. మెస్కెనో చివరిసారి తన కుటుంబాన్ని అశ్రుపూరిత నేత్రాలతో సాగనంపాడు. అంతకన్న ఏమి చేయగలడు?

మరునాడు మెస్కెనో కేసు విచారణ. అతని జీవిత పర్యంతము ద్వీపాంతరవాస శిక్ష విధించపడ్డది. మెస్కెనో తన భార్యకూడా తననునమ్మనందుకు ఎంతో విచారించాడు. నిజము దేవుడెరుగు - కాని అందుకు కొంతకాలం వస్తుంది. ఇతర ఖైదీలతోబాటు మెస్కెనో ద్వీపాంతరము పంపించబడ్డాడు.

ఇరవైఆరు సంవత్సరాలు జైలు జీవితం గడిపాడు. అతని తల తెల్లగా మంచులా అయిపోయింది. గడ్డంగూడా బాగా తెల్లగా పెరిగింది. జీవితంలోని ఆనంద తరంగాలు మాయమయినవి. వయసు ముదిరినందువల్ల వంగిపోయాడు. మెల్లగా నడుస్తాడు; మాట్లాడుతాడు. నవ్వటమనేది ఎప్పుడూలేదు; తరచుగా దేవుణ్ణి ప్రార్థిస్తాడు.

జైలులో బూట్లు తయారు చేయుట నేర్చుకొని కొద్దిగా డబ్బు సంపాదించాడు. ఆ డబ్బుతో "యోగిజీవితం" అనే గ్రంథాన్నికొని చదువుతూండేవాడు. రాత్రిళ్లు నిద్రపట్టేవరకు దైవప్రార్థన చేసేవాడు.

జైలు అధికారులు, తోటి ఖైదీలు యితని వినయమునకు చాల గౌరవించెడి

వారు. వాళ్లంతాగూడ మెస్కెనోని "తాత" అని "గురువు" అని పిలుస్తూండే వారు. ఏమైనా జైలు అధికార్లకు చెప్పవలె వన్నతోటి ఖైదీలంతా మెస్కెనోను తమ నాయకునిగా ఎన్నుకొనేవారు.

మెస్కెనో యింటిదగ్గరనుంచి ఏసమాచారమూ లేదు. తన భార్య పిల్లలు బ్రతికి వుండీ లేనీగూడా తెలియదు.

ఇట్లావుండగా ఒకరోజున అదే జైలుకు కొత్త ఖైదీలువచ్చారు. ఆ రోజు సాయంత్రం పాతవాళ్లంతా కొత్తవాళ్ల దగ్గర జేరి వారి కథలను, యిక్కడికి రావటానికి గల కారణములను, చేసిన నేరములను అడిగి తెలిసికొన్నారు. ఈ కొత్త వారిలో మాకర్ అను ఖైదీ తన వృత్తాంతము చెపుతూ తను వ్లాడిమీర్ గ్రామంవాడ నని చెప్పాడు. ఇంతవరకు మెస్కెనో తన కేమీ సంబంధము లేకుండా కూర్చొని, ఈ కొత్తదొంగ తన వూరినించి వచ్చా డనే సంగతి తెలియగానే తలపైకెత్తి మెస్కెనో కుటుంబమునుగూర్చి "వారు బ్రతికేవున్నారా" అని అడిగాడు.

"మెస్కెనో వాళ్లు నిజంగా భాగ్య వంతులు. మెస్కెనో ద్వీపాంతరము పంప బడ్డాడు-అన్నట్లు తాతా! నీవు యిక్కడి కెందుకొచ్చినట్లు?" అన్నాడు మాకర్.

"నేను చేసికొన్న పాపాన్ని అనుభ విస్తున్నాను. ఎవరు చేసికొన్న కర్మ వారనుభవింపక తప్పుతుందా నాయనా!" అన్నాడు మెస్కెనో.

"ఏం పాపాలు తాతా?" అన్నాడు మాకర్.

మెస్కెనో ఏమీ మాట్లాడలేక పోతే తోటి ఖైదీలంతా అతని కథ చెప్పారు. మాకర్ ముఖంలో ఆశ్చర్యం పొడ సూపింది. ఇతని ఆశ్చర్యాన్ని చూసి టప్పటికి యితర ఖైదీలకు అనుమానంవేసి "మెస్కెనోని యిదివరకు ఎప్పుడైనా చూచావా" అని ప్రశ్నించారు. మాకర్ ఏమీ సమాధానం చెప్పక మామూలుగా "మనమంతా యిక్కడ తలవని తలంపుగా కలిశాము" అని వూరుకున్నాడు.

ఈ మాటలు మెస్కెనోని ఆశ్చర్య చకితుణ్ణిచేసినయ్. ఆ వర్తకుడిని చంపినది ఎవరో యితనికి తెలిసి వుండవచ్చుననుకుని మాకర్‌తో "నా కథవిన్నావుగదా - నన్ను యింతకు ముందు చూసేవుంటావు." అన్నాడు మెస్కెనో.

"తెలుసుకొని నేనేం చేసేది! ఈ ప్రపంచంవుందే వట్టివదంతుల పుట్ట. చాలా కాలం క్రిందటి విషయం నేను మరచి పోయాను." అన్నాడు మాకర్.

"బహుశా ఆ వర్తకుణ్ణి చంపింది ఎవరో నీకు తెలిసే వుండొచ్చు అనుకుంటాను" అన్నాడు మెస్కెనో.

మాకర్ నవ్వుతూ "ఎవరి సంచీలో అయితే కత్తి దొరికిందో వారే యీపని చేసివుండొచ్చు! అయినప్పటికీ దొరికిన దాకా దొంగ దొంగకాదు. దొరికితే దొంగ - కాకపోతే దొర. కాని, ఎవరో చంపినట్లయితే ఆ కత్తి నీతల క్రింది కెట్లావస్తుంది? మరొకరెవరైనా పెట్టినట్లయితే మెలుకువ వచ్చియుండేది కదా"

ఈ మాటల్ని బట్టిచూస్తే మాకర్ యీపని చేసి వుంటాడని యెస్కేనో తలంచాడు. రాత్రంతా నిద్రపట్టలేదు. సంతకు తను బయలుదేరటం, భార్య నివారించటం, పిలవాని ముద్దుముఖము అవన్నీ తన మనసులో గిర్రున తిరిగాయి. ఎట్లాగో తెల్లవారింది. తన ఈ స్థితికి కారకుడైన మాకర్ మీద చాలా కోపం వచ్చింది.

ఇట్లా ఒక పక్షం రోజులు గడిచింది. రాత్రిళ్లు యెస్కేనోకు నిద్రపట్టటంలేదు. తనమీద తనకే విరక్తి పుట్టింది. ఒక రోజు రాత్రి యెస్కేనో జైలు వరండాలో పచార్లు చేస్తుండగా మాకర్ వున్నగదిలో ఏదో శబ్దం వస్తుంటే అక్కడ ఆగిచూచాడు. ఇంతలో మాకర్ యెస్కేనోను చూచి బైటకువచ్చి యెస్కేనో చేయిపట్టుకొని "నేను యిక్కడ గోడక్రిందనుంచి సొరంగము త్రవ్వుతున్నాను. మనిద్దరం ఈ సొరంగము ద్వారా పారిపోవచ్చు. నీవు యీ విషయం వెల్లడిచేశావా నాకు వురి శిక్ష వేస్తారు; వెల్లడిచేస్తానంటే నేను నిన్ను యిప్పుడే చంపేస్తాను." అన్నాడు.

"నాకు యిప్పుడు పారి పోవలసినంత అగత్యములేదు! దైవ విధి ఎలావుంటే అలా జరిగి తీరుతుంది" అని అక్కడనుంచి వెళ్ళి పోయాడు యెస్కేనో.

మరునాడు ఖైదీలందరు తమతమ పనులకు పోయినతరువాత జైలు వార్డను మాకర్ త్రవ్విన సొరంగము చూశాడు. ఈ సంగతిని గురించి ఖైదీలందరిని అధికారులు అడిగారు. ఎవరికీ తెలియదన్నారు. చిట్టచివరికి అధికారి యెస్కేనోను పిలిచి "తాతా! అందరిలోకి నీవు నిజాయితీ వాడవు. నీవంటే నాకు నమ్మకం వుంది. ఎవరు ఈ సొరంగం త్రవ్వారో చెప్పు" అన్నాడు.

యెస్కేనో అంతఃకరణ "నీకు వాడు అపకారం చేస్తేనేమి! నీవు వానికి వుపకారం చేయి! ఒక చెంపమీద కొడ్తే రెండో చెంపకూడ చూపించు" అని బోధించింది.

ఇంతలో మళ్లీ అధికారి ప్రశ్నించాడు 'నిజం చెప్పు ఎవరు ఈ సొరంగం త్రవ్వారు?'

యెస్కేనో మాకర్ను చూస్తూ "అయ్యా! ఈ విషయం నాకేమాత్రం తెలియదు. మీరేమి చేయదలస్తే అది

చేయవచ్చును. ఇప్పుడు నేను మీ అధీనుణ్ణి'' అన్నాడు.

నిజము రాబట్టలేక అధికారులు ఆ విషయం వదిలేశారు. ఆ రాత్రి యెస్కెనో తన పక్కమీద పడుకోంగనే తన సమీపంలో యెవరో వచ్చి కూర్చునట్టు శబ్దం వినిపించింది. చీకట్లో యెట్లాగో ఆ వచ్చింది మాకర్ అని గ్రహించాడు.

''నా వల్ల ఏంకావాలి నీకు? యెందుకొచ్చావు?'' యెస్కెనో అడిగాడు.

మాకర్ మాట్లాడలేదు.

యెస్కెనో లేచి కూర్చుని గట్టిగా ''ఏంకావాలి? చెప్పు లేదా అధికారిని పిలుస్తాను!'' అన్నాడు.

''నేను మాకర్‌ను; నన్ను క్షమించు''

''యెందుకు?''

''నేనే ఆ వర్తకుని చంపి ఆ కత్తి నీ సంచీలో పెట్టింది. నిన్నుకూడా చంపాలని ప్రయత్నించాను. కాని బైట ఏదో చప్పిడి అవటంవల్ల కత్తి మీ సంచీలో పెట్టి కిటికీలోంచి పారిపోయాను.'' అని అంటూ మాకర్ యెస్కెనో కాళ్లమీదపడ్డాడు.

యెస్కెనో ఏమీ మాట్లాడలేదు.

''నన్ను క్షమించు! దైవభక్తికొరకైనా నన్నుక్షమించు. నేనే ఆ వర్తకుని చంపినట్లు వెల్లడిచేస్తాను. నీవు తిరిగి యింటికి పోవచ్చు.'' అన్నాడు మాకర్.

''చెప్పటం సులభమే కాని నేను యిక్కడ యిరవైఆరు సంవత్సరాలు కాలం గడిపాను. నేను యిప్పుడెక్కడికిపోయేది? నా భార్య చచ్చిపోయింది. నా పిల్లలు నన్ను గుర్తుపట్టలేరు. నేను విడుదలైపోతే నాకు బైట చోటులేదు...'' అన్నాడు యెస్కెనో.

''క్షమించుతాతా! నన్ను వురికంబమెక్కించినా అంత బాధలేదుకాని, నీవు క్షమించక పోయినందుకు చాలా బాధపడుతున్నాను'' అని కళ్లవెంటనీరు కార్చాడు.

మాకరు దుఃఖము చూచి యెస్కెనో గూడ దుఃఖించాడు. దయకలిగింది.

''దైవము నిన్ను క్షమిస్తాడు. నేను నీకన్న కొన్నివందలరెట్లు అధముడను కావచ్చు'' అన్నాడు యెస్కెనో. అతని హృదయం తేలికైంది. ఇంటికి పోవాలనే వుద్దేశ్యములేదు; కాని అంత్య గడియల కొరకు ఎదురు చూస్తున్నాడు.

మాకరు మరునాడు జైలు అధికారి వద్దకు పోయి తన దోషిత్వాన్ని వెల్లడించాడు. కాని, అతని విడుదల ఆర్డరు వచ్చేసరికి ఎస్కెనో నిజంగానే ఈ లోకంలోంచి వెళ్ళిపోయాడు.

భార్యకలనికల: యెస్కెనో విడుదలౌతాడు ఇంటికి ప్రయాణమవుతాడు. అప్పటికి అతని వెంట్రుకలు నెరసివుంటాయి. భార్య తను చెప్పిన కల నిజమంటుందా? దేముడు తప్పు గ్రహిస్తాడు; కాని అందుకు కొంతకాలం పడుతుంది.

# ప్రబుద్ధుడు!

శ్రీ జి. వజ్రం

సిద్ధార్థుడు తన భార్య యశోధరను నిద్రిస్తూ ఉండగా విడచివెళ్ళిపోయినాడు. బ్రహ్మజ్ఞానము పొంది తిరిగివచ్చినాడు. అప్పుడు యశోధర సిద్ధార్థుని విశిష్టతను అంగీకరించి ఆయన శిష్యత్వాన్ను స్వీకరించినది. లక్ష్మినివదలి ఆమె భర్త ప్రొఫెసర్. మూర్తి అర్ధరాత్రివేళ ఎచ్చటికో వెళ్ళిపోయినాడు. ఆయన ఎన్నటికైన తిరిగివచ్చునా? తిరిగివస్తే ఎలా వచ్చును? అన్న విషయం ఎవరికీ తెలియదు. కాని లక్ష్మి మాత్రం దుఃఖసాగరములో మునిగివున్నది. ఆమె ఆలోచనాశక్తిపనిచేయడంలేదు. మనస్సు అశాంతితోనిండి ఉన్నది. వెండ్రుకలు అస్తవ్యస్తంగా ముఖముపై వ్రేలాడుచున్నవి. ముఖము వాడిన పుష్పమువలె - వాడి ఉన్నది. నేత్రములనుంచి, అశ్రుధారలు ఆమె చెక్కిళ్ళపైపడి క్రిందకు ప్రవహిస్తున్నవి. 18 సంవత్సరముల నవయువతి లక్ష్మి ముఖము అర్ధమూర్ఛితురాలైన 30 సంవత్సరముల ప్రౌఢ స్త్రీ ముఖమువలె కన్పిస్తున్నది. లక్ష్మికి ప్రపంచమంతా అంధకారాచ్ఛాదితమగుచున్నట్లుగా గోచరిస్తున్నది. అప్పుడే నీలాకాశములోని మెఱుపువలె అంధకారాచ్ఛాదితమైన ఆవాతావరణములో తన భర్త ఉత్తరం ఆమెచేతి కివ్వబడినది. అందులో యిలావుంది:—

లక్ష్మీ!

నేను పోవుచున్నాను. ఎచ్చటకో తెలియదు. ఎచ్చటకని నీవు ప్రశ్నించవచ్చు - తిరిగి వచ్చిన తరువాతనే దానికి నేను జవాబు చెప్పగలను. కాని ఎప్పుడు తిరిగిరాగలనో చెప్పలేను. అయినప్పటికిన్ని బ్రతికిఉండగనే తిరిగి రాగలనన్న ఆశ మాత్రం నా హృదయంలోవుంది.

నీపై లేక మన కుటుంబములోని మరెవ్వరిపై అయిష్టతవల్ల నేను వెళ్ళిపోయినానని నీవు కలలోగూడ తలచవద్దు. నిజంగా యీ ప్రపంచములో నీవే నా హృదయాన్ని ఆకర్షించెడి సూదంటురాయివి.

నిన్ను మన వైవాహిక జీవితంనుంచి విముక్తురాలుంగాచేసి వెళ్ళితే బాగుంటుందని నేను భావించినాను. కాని అందుకు నా మనస్సు అంగీకరించడము లేదు. అదియునుగాక అది నీకు సుతరాం యిష్టముండదని నా తలంపు.

నీవు నా తల్లిదండ్రుల సంరక్షణలో ఉందువుగాన యిచ్చట నీకేలాంటి కష్టముండదు.

నీవు యిప్పుడు నిద్రాదేవి ఒడిలో హాయిగా నిద్రిస్తున్నావు. పూర్ణచంద్రునివలె ప్రకాశించెడి నీ ముఖము నన్నెంతో ఆకర్షిస్తున్నది. అది నా లక్ష్యసిద్ధికి అడ్డువచ్చేటట్లున్నది. కనుక వెంటనే వెళ్ళిపోవుచున్నాను.

ఒక ప్రశ్నకి జవాబు పొందుటకు వెళ్ళిపోవుచున్నాను. జవాబు పొందిన వెంటనే తిరిగి వచ్చెదను.

'మూర్తి'

ఈ ఉత్తరములోని ప్రతి అక్షరము లక్ష్మి హృదయాన్ని శల్యములవలె బాధించినది. ఆ బాధను భరించలేక ఆమె ఒక చిన్న పిల్లవలె విలపించినది. ఆయన ఎందుకు వెళ్లిపోయినారు? ఏ అభావము వల్ల వెళ్ళిపోయినారు? నావల్ల ఏమయిన తప్పిదము జరిగినదా? ఆమె బుద్ధి పనిచేయడంలేదు. ఆమె భర్త ఎం. ఎ. డి. ఫిల్ యూనివర్శిటిలో సీనియర్ ప్రొఫెసరు. ఆయన ఏప్రశ్నకి జవాబు పొందుటకు భార్యను, తల్లిదండ్రులను, విడచివెళ్ళినారు? ఇక నాగతి ఏమిటి? భవిష్యత్తు ఏమిటి? భవిష్యత్తుయొక్క ఒక భయంకరమైన దృశ్యము ఆమె కండ్లకు కన్పించినది. వయస్సులో ఏకాకి జీవిత

మును ఎలా సహించగలను? నా భావి కల్పనలు, ఆశలు, ఆకాంక్షలు ప్రచండ తుఫానులోని మేఘములవలె ఎగిరిపోవలసినదేనా? నా యీ జీవితంకంటె మృత్యువు అనేకరెట్లు ఉత్కృష్టమైనది. జీవితములో ఎప్పుడో ఒకప్పుడు మృత్యువుకి బలికాక తప్పదు. అది నేడే ఎందుకుకాకూడదు? కాని ఆమె స్వయముగా మృత్యువును ఎలా ఆహ్వానించగలదు? ఈ యింటిలో ఆమెను ఎవ్వరు ఆత్మహత్యచేసుకోనివ్వగలరు? అత్తమామ ముసలివారు. వారికిమట్టుకు యింకెవ్వరున్నారు? అప్పుడే ఆమె తన గది తలుపు కదలిన ధ్వని విన్నది.

“లక్ష్మీ, చింతించకు, మూర్తి తప్పక వస్తాడు” అంటూ రెండు రోజులనుంచి అన్నపానీయము లెరుగక కృశించిఉన్న అత్త ఆ గదిలోకి ప్రవేశించినది. లక్ష్మి అత్తను చూడగనే లేచి ఆమెను గట్టిగా పట్టుకొని వెక్కి వెక్కి ఏడ్చినది.

“లేదుతల్లీ, యిట్లు అధైర్యపడకూడదు. మూర్తి తప్పక వస్తాడని నాకు నమ్మకం ఉన్నది. లేచి స్నానంచెయ్యి, బట్టలు మార్చుకో” లక్ష్మిని తవుడు కొంటూ అత్త రుద్ధత కంఠముతో అన్నది.

♦ ♦ ♦

నెల గడచినది. ఒక సంవత్సరంగూడ గడచిపోయినది. లక్ష్మి అచ్చట యూనివర్శిటిలో తన భర్త విషయం తీసుకొని ఎం. ఏ లో తన పేరు వ్రాయించినది. ఆమె యింతకుముందే బి. ఎ. ప్యాసై ఉన్నది. అయితే అప్పుడు ఆమె జ్ఞాన సంపాదనకోసం అధ్యయనంచేయలేదు. ఆరోజులలో అమ్మాయి బాగా చదువుకోకపోతే మంచి వరుడు ఆమెకు లభించడని ఆమె తల్లి దండ్రులు అంతవరకు చదివించినారు.

♦ ♦ ♦

ఎనిమిది సంవత్సరముల తరువాత—

శ్రీమతి లక్ష్మి ఎం. ఎ. పి. హెచ్. డి. లో ప్యాసై అచ్చట కాలేజిలోనే అసిస్టెంటు ప్రొఫెసరుగా చేరినది. నేడు ఆమె తెలుగులో ఒక ప్రముఖ రచయిత, ఈ రోజున ఆమె తన కాలేజీలో పనిపూర్తిచేసుకొని సాయంత్రం 6 ఘంటలకు స్థానిక సాహిత్య పరిషద్‌లో అధ్యక్షోపన్యాసమిచ్చి రాత్రి 8 ఘంటలకు యింటికి చేరుకొన్నది, కార్యభారంవల్ల అలసిపోయినట్టున్నది, త్వరగా భోజనం చేసి పండుకున్నది. రేపు ఒకే ఒక క్లాసు ఉన్నది. కావలసినంత విశ్రాంతి ఉంటుంది. అప్పుడే తన భర్త జ్ఞాపకంవచ్చినాడు. ఎచ్చట ఉన్నాడో, ఏమిచేస్తున్నాడో? అసలు యీ ప్రపంచంలో ఉన్నాడో లేడో? ఆమె హృదయం కంపించినది. సహించలేనటువంటిబాధ, ఆవేదన, నిద్రించుటకు ప్రయత్నిస్తుంది. కాని మనస్సులో కలవరము ఉన్నందువల్ల నిద్రపట్టడంలేదు. తన భర్త రూపము కళ్లకు కట్టినట్లు కన్పిస్తుంది. గంభీరమైన ముఖము, ప్రకాశవంతములైన నేత్రములు, వెన్నెలవలె పెదవులపై చిరునగవు, లక్ష్మి అర్ధనిమీలిత నేత్రములతో, నిండిన హృదయంతో ఆవైపే చూచుచున్నది. శ్వాస నిశ్వాసలు అతివేగంగా నడుస్తున్నవి. అప్పుడే తలుపువద్ద ఏదో శబ్దము. లక్ష్మికి మెలుకువ వచ్చినది. ఎదుట గడియారంలో 5 ఘంటలు కావస్తున్నది.

మళ్లీ తలుపును కొట్టినట్టుగా ధ్వని వినిపిస్తుంది. లక్ష్మి లేచి కూర్చొని “ఎవరచ్చట అన్నది.”

“లక్ష్మీ! లే మూర్తి వచ్చినాడు. మూర్తి ...” కొన్ని క్షణములు ఆమె ఎచ్చటనున్నది, ఏమిచేస్తున్నది ఆమెకే తెలియదు. కింకర్తవ్యవిమూఢవలె అలాగే కూర్చొన్నది. చైతన్యము వచ్చినది. మెల్లగా పులకిత శరీరంతో తలుపుతీసి కొన్ని క్షణములచ్చటనే అనిశ్చితముగా నిలుచబడ్డది. పరుగెత్తుకొని ఆయనవద్దకు వెళ్ళవలెనని అనుకొన్నది. కాని ఆమె వివేకశక్తి అందు కంగీకరించలేదు. అప్పుడే మూర్తి ఎదురుగా వచ్చుచున్నట్లు చూచినది. ఆరోగ్యవంతమైన ముఖము, చాల విలువైన సూటు, చేతికి బహుమూల్యమైనవాచి. మూర్తిని చూస్తూ లక్ష్మి కండ్లార్చడమే మరచిపోయినది.

మూర్తి దగ్గరకొచ్చి ప్రేమ పూరితమైన స్వరంతో 'లక్ష్మీ' అన్నాడు. ఆమె చేతిని తన చేతిలోకి తీసుకొంటూ నన్ను క్షమించవూ?

"క్షమించుట ... ఎందుకు?" ఆమె కంఠం ఆగిపోయినది.

"అపరాధివలె వెళ్ళిపోయినందుకు?"

"ఎవడు స్వయంగా తనకు అపరాధము చేసుకొన్నాడో వాడు ప్రపంచంలో మరెవ్వడికి అపరాధి కాజాలడు" అని లక్ష్మి గంభీర స్వరముతో అన్నది.

కొన్ని క్షణముల వరకు మూర్తి విస్మయముతో నిండిన దృష్టితో ఆమెను చూచినాడు. లక్ష్మి, తను కనపడగనే ఏడ్చి క్షమించ ప్రార్థించునని మూర్తి అనుకొన్నాడు. కాని ఆమె యిలా జవాబిచ్చునని అతను ఎన్నడూ ఊహించలేదు. పతియే తన సర్వస్వమని భావించుకొని 'ప్రేమముగ్ధురాలైనటువంటి ఆ నా లక్ష్మియేనా యీమె?'

"నేనేమయిన తప్పు అన్నానా" అన్నది లక్ష్మి.

"లేదు, నీవు అన్నది నిజమే."

"మీ ప్రశ్నకు జవాబు లభించినదా?"

"ఆ ప్రశ్న ఏమిటో అడకకుండానే జవాబును గురించి అడుగుచున్నావేమి?"

"ప్రశ్న ... ఆ ప్రశ్న నడుగుటకు నేనెవతెను?"

మూర్తి బిగ్గరగా నవ్వుతూ "ఓ, అమ్మగారికి కోపం వచ్చినదా?"

"కోపమా?" లక్ష్మి తన తలపైకెత్తి "నాకెలాంటి కోపము మీపైలేదు. ఒక వ్యక్తి, వ్యక్తిగత జీవితముపై మరొక వ్యక్తికి ఎలాంటి అధికారము లేదు. భార్యాభర్తలయినాసరే."

"పెద్ద వేదాంతికవయినావే నీవు?"

"లేదు. అలాంటిదేమి లేదు. మీ ప్రశ్నకు జవాబందినదా?"

"మొదట ఆ ప్రశ్న ఏమిటో విను."

"చెప్పండి."

"గీత వంటి పుస్తకములలో మానవుడు స్థితప్రజ్ఞుడు కావలెనని భగవంతుడు ఆదేశించినాడుగదా? అలాంటప్పుడు ఆ భగవంతుడే యీ ప్రపంచములో యిన్ని చిత్రవిచిత్రములైన వస్తువులను ఎందుకు సృష్టించినాడు? అన్న ప్రశ్న నాలో ఉదయించినది. దానికి జవాబు పొందుటకే నేను వెళ్ళినది. హిమాలయ పర్వతములలో యోగులు, సాధు సన్యాసులు ఉన్నారని విన్నాను. బ్రహ్మజ్ఞానులని గూడ విన్నాను. కనుక వారివద్దకు వెళ్లి వారి సేవాశుశ్రూష చేసిన నా ప్రశ్నకు జవాబు రాగలదని ఆశించినాను. ఈ ఎనిమిది సంవత్సరములు ఆ పర్వతములలోనున్న యోగి పుంగవులను సందర్శించుచూ గడిపినాను. కాని లాభం లేకపోయినది. ఎచ్చట నా ప్రశ్నకి సరియైన జవాబు లేదు. కనుక ఏకాంతవాసినై యిలా తిరుగుట వ్యర్థమని జీవితముయొక్క లక్ష్యము భోగించడమేనని నిశ్చయించుకొన్నాను."

"అప్పుడు."

"అప్పుడేమిటి, నీ వద్దకు తిరిగివచ్చినాను. వస్తూ వస్తూ నీకు అనేక రకములైన చీరెలు, ఆభరణములు తెచ్చినాను. అవిగో అచ్చట చూడు నీకేమి యిష్టమో?

ఈ మాటలు విన్న తరువాత లక్ష్మికి, తన భర్త పాండిత్యము విద్వత్తుపైనున్న శ్రద్ధాభావము గాలిలోని దుమారమువలె ఎగిరిపోయినది. ఆకస్మికముగా ఆమె తన భర్తకు తన హృదయంలోనున్న ఉచ్చస్థానము, పూజ్యభావము కోల్పోతున్నట్లు అనుభవించినది. తన భర్తకూడ ఒక అతిసాధారణ వ్యక్తేనని, మామూలుగా జాగరూకులైన వ్యక్తుల మనస్సులలో ఉదయించెడి భావములే ఆయనలో ఉదయిస్తున్నవని ఆమె అనుకొన్నది. ఏవిధముగా కూడ తన భర్త ఒక విశిష్టమైన వ్యక్తి కాదని, ఆమె కంటె ఆయన ఏదృష్టిలోగూడ ఎక్కువ కాదని ఊహించుకొన్నది.

♦ ♦ ♦

కొన్ని రోజుల తరువాత ప్రొఫెసర్ మూర్తి అసిస్టెంటు ప్రొఫెసరయిన తన భార్య లక్ష్మి సంఘంలో మంచి పేరు ప్రతిష్టలు సంపాదించుకో గలిగినదని తెలుసుకొన్నాడు. ఇప్పుడు ఆమెను తన యింటి నాలుగు గోడలమధ్య ఉంచడం తనకు సాధ్యంకాదని గ్రహించినాడు. లక్ష్మి తన ప్రతిభా విశిష్టతవల్ల దేశంలో తనకంటె ఎన్నోరెట్లు ఖ్యాతిని గౌరవమును పొందగలిగినదని అర్థంచేసుకోగలిగి నాడు. అయితే జీవితంలో బుద్ధభగవానుడు కావలె నన్న తన రమ్య స్వప్నము సుదూర మార్గంలో కన్పించే దీపపుకాంతివలె అంధకారములో విలీనమై పోయినందుకు చింతించినాడు.

—o—

ఒక వయసు మీరిన యువతి తన స్నేహితుని "ఏమండీ! నా వయస్సు ఏమి యుంటుందని మీ యూహ" అని ప్రశ్నించింది.

"నాకలా యూహించగల శక్తిలేదు"

"అదేమిటి! అలాగంటారు - మీ మనసులోనున్నది. చెప్పండురూ!"

"ఇందులో నాకు సంకటమేమిటంటే- మీ అందమును బట్టి 10 సంవత్సరములు చిన్నగా యూహించడమా! లేక మీ తెలివి తేటల నాధారంగా చేసికొని 10 సంవత్సరములు పెద్దగా చేయడమా అనేది"

♦ ♦ ♦

పుట్టినరోజు పండుగనాడు అల్లునికి మామ పిల్లనగ్రోవిని తెచ్చి బహూకరించి "ఊదడం తెలుసా" అని అడిగాడు.

ధన్యవాదాలు తెలుపుతూ "తెలియదు మామగారూ! - కాని అమ్మ పగలు పూట ఊదవద్దని ప్రతివారం నాలుగణాలు, రాత్రిపూట ఊదవద్దని నాన్న ఆరణాలు యిస్తారు" అన్నాడు అల్లుడు.

♦ ♦ ♦

ఫొటోగ్రాఫిక్ స్టూడియోకు వెళ్లి తాను తీయించుకొనిన ఫోటోనుచూస్తూ "ఇందులో సహజమైన వయస్సుకంటె ముదురుగా కనుపిస్తున్నాను" అన్నాడు.

ఫొటోగ్రాఫర్ "అయితేనేం! ముందు ముందు ఫొటోతీయించుకోవలసిన అవసరం లేకుండా పోతుంది" అన్నాడు.

♦ ♦ ♦

ఒక కవికుమారుడు తన మిత్రునితో "పాటలను నిర్విరామంగా వ్రాస్తున్నాను" అన్నాడు.

"వేనినైనా అమ్మేవా!"

"అమ్మక పోవడమేమిటి! - సైకిలును, ఫౌంటెన్ కలాన్ని, చేతిగడియారాన్ని..."

# సిరిసిరిమువ్వలు

'నారపీచు'

హోటలుకు వెళ్ళి ఆకలితో నకనక లాడుతున్న వ్యక్తి వడ్డించేవానితో "ఏమయ్యా! నీవు పెట్టబోయే భోజనానికి మాడి చచ్చి పోయేదాక కనిపెట్టుకొని యుండాల్సిందేనా!" అన్నాడు కోపంగా.

"అలా అవసరముండదు - తొమ్మిది గంటలకు హోటలు మూసేస్తాము" అన్నాడు వడ్డించేవాడు.

◆ ◆ ◆

మందమతిగా నుంటున్న తన కుమార్తెను ఒకాయన డాక్టరు దగ్గరకు తీసికొని వెళ్లాడు. పరీక్షచేసి డాక్టరు "ఏమండీ! మీ అమ్మాయి రాత్రి పండుకో బోయేటప్పుడు పాలు త్రాగి పండుకుంటుందా" అని అడిగాడు. "అవును" అన్నాడు తండ్రి.

"మీ అమ్మాయి ఉదయం లేవగానే ఉత్సాహంగానుండనందుకు అదే కారణం. పండుకోబోయేముందు పిల్లలకు పాలుపడితే పండుకొని నిద్రపోయి అటుయిటు పొర్లు నప్పుడు పాలు మీగడగాను, మీగడ వెన్నగాను, వెన్నకొవ్వగాను, కొవ్వు చక్కెరగాను, చక్కెర మద్యముగాను కడుపులో మారి ఉదయంలేవంగానే మత్తుగాను, తూలుడుగానుంటుంది" అన్నాడట డాక్టరు.

◆ ◆ ◆

ఒక వ్యాపార సంస్థయజమాని తన ఆఫీసుగది వాకిట్లో క్రొత్తగా పిల్లవాడిని యుంచి, వచ్చిన వారిని విచారించి లోపలికి పంపవలసినదిగా నియమించాడు.

ఒకరోజున ఒకాయన వచ్చి యజమానిని చూడాలన్నాడు.

"అయితే మీరు అమ్మకం, కొనుగోలు పనిమీదవచ్చారా? లేక మీరు బిల్లుకలెక్టరా! లేక మా యజమానికి స్నేహితులా?"

"నేను మూడూనూ"

పిల్లవాడికది విని అమోమయంగాతోచి "అలాగయితే యజమాని ఎవరితోనో మాట్లాడుతున్నాడు; ఆయన యూళ్ళోలేడు; గభాలున నేరుగాలోపలికెళ్లి చూడండి" అన్నాడు.

# బాలలు బాగుపడడమే దేశానికి సౌభాగ్యం

## వారి యోగ క్షేమాల వృద్ధికై మాతా సంఘాల అమోఘకృషి

---o---

వాషింగ్టన్ నగరంలోఉన్న "మాతా సంఘాలు" పిల్లల ఆటలకోసం విపరీతకృషి చేస్తున్నాయి. ఈ పనికోసం "కేంద్రమాతా సంఘం" కూడా ఒక టుంది. కేంద్రసంఘ సహకారంతో వాషింగ్టన్ లోని మాతా సంఘాలు బడికివెళ్లే వయస్సులేని పిల్లలకు చక్కని ఆటలు ఏర్పాటుచేసి, తద్వారా వారి మనోవికాసానికి సాయపడుతున్నాయి.

మూడు, నాలుగు సంవత్సరాల వయస్సులుగల పిల్లలు ఇంటిలోవుంటే అల్లరిచేస్తారు. పోనీ బడికి పంపుదామంటే, వారిది చదువుకొనే వయస్సు కాదు. అందుచేత, ఇటువంటి పిల్లల ఆట స్థలాలను ఏర్పాటు చేసే ప్రభుత్వ కార్యాలయం కృషిలో ఈ మాతా సంఘాలు ఎక్కువగా పాల్గొంటాయి. అంతేకాదు, ఈ కార్యక్రమాన్ని వయోజన విద్యాభ్యాసానికి కూడా పనికివచ్చేలాగ మాతా సంఘాలు వృద్ధి చేశాయి.

"ఈ కార్యక్రమంవల్ల ఎక్కువ ప్రయోజనం పొందుతున్నది పిల్లలో, తల్లులమైన మేమో చెప్పడం చాలా కష్టం" అని మిసెస్ ఎలిజబెత్ విల్సన్ అన్నది. ఈమె వాషింగ్టన్ నగర కేంద్ర మాతా సంఘం అధ్యక్షురాలు. "ఈ కార్యక్రమంవల్ల ఉత్తమశ్రేణి బాలలు, తల్లులు, పౌరులు రూపొందుతున్నారు" అని కూడా ఆమె చెప్పింది.

ప్రభుత్వపు క్రీడా శాఖవారు 1930 తరువాత ఈ కార్యక్రమాన్ని ప్రారంభించడం జరిగింది. ప్రజలకు వినోద కార్యకలాపాలను ఏర్పాటుచేయడంలో బాలలకుకూడా క్రీడాస్థలాలను ఏర్పాటుచెయ్యడం జరిగింది.

ఈ కార్యాలయం సూపరెంటు మైలో క్రిస్టియన్ సెన్ అన్నదిది — "చిన్న పిల్లలకు ముఖ్యంగా కావలసింది ఆట. అందుచేత, వారు ఇంటిపట్టునే వుండి ఆడుకొనడంకంటె, నూతన పరిసరాలలో లేదా తమ ఇంటికి భిన్నమైన వాతావరణంలో ఆడుకొనే అవకాశం వుండడం చాలా ముఖ్యం. అలాగచేస్తే, బాలలకు తమ ఇల్లు మాత్రమేకాక బాహ్యమైన ఒక ప్రపంచం వున్నదనీ, ఇంకా అనేకమంది తోటి పిల్లలు వున్నారనీ, వారిలో తమకు స్థానం వున్నదనీ గ్రాహ్యమవుతుంది."

వాషింగ్టన్ నగరంలో ఇటువంటి బాల్య క్రీడా స్థలాలు అనేకం వున్నాయి. శని, ఆదివారాలు తప్ప మిగతా అయిదు రోజులు బాలలు వాటిలో ఆడుకొంటూ వుంటారు. బాలల మనస్తత్వాన్ని బాగా తెలిసికొని, వారిచేత ఆటలు ఆడించడంలో శిక్షణ పొందినవారు వాటిలో పర్యవేక్షణచేస్తూ వుంటారు. ఈ శిక్షణపొందినవారిని ప్రభుత్వ కార్యాలయం నియమిస్తుంది.

ఎటువంటి రుసుము చెల్లించనవసరంలేకుండా ఆరోగ్యవంతులైన పిల్లలెవరైనా సరే ఆ క్రీడా స్థలాలకురావచ్చు. ఈ ప్రకారం అక్టోబరునెల మొదలు జూన్ నెలవరకు జరుగుతూ వుంటుంది.

ప్రభుత్వం ఈ కార్యక్రమాన్ని ప్రారంభించగానే మాతా సంఘాలు ఏర్పడ్డాయి. బాలక్రీడాస్థలం వున్నచోటనల్లా ఒక్కొక్క సంఘం వెలిసింది. ఇటువంటివి సుమారు 43 క్లబ్బులలో 1000 మంది తల్లులు సభ్యులుగా వున్నారు.

పిల్లల క్రీడా కార్యక్రమంలో శిక్షణ పొందిన ఉద్యోగులు ఈ తల్లులకు, పిల్లలచేత ఏవిధంగా ఆటలు ఆడించాలో సలహాలు యిస్తారు. ఈ తల్లులు పిల్లలకు కథలు చెబుతారు. పాటలు నేర్పుతారు. వారితోకలిసి ఆడుతారు. పిల్లలకు జంతు ప్రదర్శన శాలలు మొదలైనవాటిని చూపుతూ వుంటారు.

మాతా సంఘాల సభ్యులు ప్రతినెలా చందాలు యివ్వాలి. ఆ విధంగా వచ్చిన డబ్బుతో పిల్లలకు ఉదయం పదిగంటల ప్రాంతంలో బత్తాయి రసం కొనియివ్వడమో, లేదా ఆయా కేంద్రాలకు అవసరంగావున్న ఆటవస్తువులను కొనడమో చేస్తూ వుంటారు. ఒక్కొక్కప్పుడు బాల మనస్తత్వ నిపుణులనురావించి, పిల్లలకు కథలుచెప్పే పద్ధతులు ఆటలను సమన్వయపరచే పద్ధతులు, సమూహ గాన పద్ధతులు మొదలైనవాటిని మాతా సంఘ సభ్యులు నేర్చుకొంటూ వుంటారు.

"మాతా సంఘాల కార్యక్రమంలో ముఖ్యమైన భాగం తలులకు సరియైన శిక్షణ యిప్పించడం" అని మిసెస్ విల్సన్ వివరించింది.

మాతా సంఘాల సభ్యులు ప్రతినెలా సమావేశాలు జరుపుకుంటారు. వీటిలో పిల్లల ఆటల కార్యక్రమాలను గురించి చర్చించుకుంటారు. మూడు, నాలుగు సంవత్సరాల వయస్సుల పిల్లలుగల తల్లిదండ్రులకువుండే సమస్యలను గురించి చర్చిస్తారు. ఒక్కొక్కప్పుడు పిల్లల మనస్తత్వం గురించిన పుస్తకాన్ని తీసుకొని దానిమీద చర్చ జరుపుతారు.

ఇన్ని విధాలుగా మాతా సంఘాల సభ్యులు కృషిచేస్తున్నప్పటికీ, వారికి ఒక్కొక్క కొరకరాని సమస్య ఎదురవుతూ వుంటుంది. అటువంటప్పుడు ఒక మేధావిని రావించి తగు సలహాలు పొందుతూ వుంటారు.

కొన్ని సందర్భాలలో మాతా సంఘాలు కేవలం కులాసాగాకూడా సమావేశమవుతూ వుంటాయి. ఉదాహరణకు, ఒక క్లబ్బు సభ్యులలో ఇండోనీసియా, ఫ్రాన్సు, స్వీడన్, పోలెండ్ లనుంచి వచ్చిన వారున్నారు. ఆదేశాల వంటకాలు ఎలా వుంటాయో తినడానికి ఈ క్లబ్బు సభ్యులు సమావేశమై కులాసాగా గడిపారు.

ఒక్కొక్క క్లబ్బులో ఒక్కొక్క విశేషం వుంటూ వుంటుంది. పైగా ఒక క్లబ్బులో సభ్యుల కార్యకలాపాలు ఒక విధంగాను, మరొక క్లబ్బులో కార్యకలాపాలు మరొక విధంగానూ వుంటూంటాయి. అందుచేత, ఈ క్లబ్బులన్నింటినీ ఒక దానితో ఒక దానికి సంబంధం ఏర్పాటు చెయ్యవలసిన అవసరంవచ్చి కేంద్ర మాతా సంఘాన్ని ఏర్పాటు చేసుకున్నారు. కేంద్ర సంఘ సభ్యులను మాతా సంఘాలు ఎన్నుకుంటాయి.

బాలలకు ఒకానొక విషయాన్ని తెలియజెప్పడానికి ఏ ఫిలిం చూపడం మంచిది? ఒకానొక సమస్య గురించి విపులంగా తెలుసుకోడానికి ఏ నిపుణుని సలహా చెయ్యాలి? ఒకానొక బాల క్రీడా స్థలంలో కొరతగావున్న వస్తువులను కొనడానికి ఏ మాతా సంఘంవారు తోడ్పడుతారు? ఇత్యాది సమస్యలన్నింటిలో ఆయా మాతా సంఘాలకు కేంద్ర సంఘంవారు సహాయపడుతూంటారు.

మాతా సంఘాల సభ్యులందరికీ ఆధునిక పద్ధతులు తెలుస్తూ వుండడానికే కేంద్ర సంఘంవారు మాస పత్రిక నొక దానిని ప్రకటిస్తూంటారు.

బాలల వినోదానికి, ఆరోగ్యాభివృద్ధికి ఈ కేంద్ర సంఘం స్వయంగాకూడా పాటుపడుతూ వుంటుంది. మాతా సంఘాల సభ్యులు తమ తమ ప్రాంతాలలో పిల్లలకు వ్యాధి నిరోధక ఔషధాలను ఇప్పించి, కళ్లు, పళ్లు, పరీక్ష చేయించి తగు సలహాలుయిచ్చి సహాయపడుతూంటారు.

"మా కార్యక్రమం యావత్తుకూడా బాలల జీవయాత్ర శోభాయమానంగా ప్రారంభం కావడానికి ఉద్దేశించబడింది. తల్లులమైన మాకు మా పిల్లలు చక్కగా వృద్ధిలోకిరావడంకంటె కోరుకోతగ్గది యేముంది?" అని కేంద్ర సంఘానికి ఒక ఏడాది పాటు అధ్యక్షురాలైన మిసెస్ జార్జిపేట్ అన్నది.

# ఆడకత్తెర

శ్రీ న. రా. శివస్వామి



రామారావు:-అమ్మా వంటయిందా ?

నరసమ్మ:-అయిందిరా నాయనా. ఇవాళ కొంచెం లేటయిపోయింది.

రా:-(కామశాస్త్రితో)-అన్నయ్యా, అమ్మ కూడా ఇంగ్లీషు నేర్చేస్తునాది !

కామశాస్త్రి:-నేను ప్రైవేటు స్టూడెంట్లకి చెప్తూంటే ఒకటి రెండు మాటలు అమ్మచెవిని పడుతుంటాయి.

రా:-అవి మళ్ళీ రెండో చెవిలోంచి వెళ్ళిపోకుండా వుంటాయన్నమాట.

న:-ఊరుకోందురూ, మీరూ మీ వేళాకోళాలున్నూ కాటికికాళ్లు చాచుకొని నాకింగ్లీషు తక్కువయింది !

కా:-(భోజనానికి వెళ్తూ) - పదరా భోజనానికి - ఇంకా మడికట్టుకోలేదేమిటి ?

రా:-ఇదే యుద్ధంబునకు సిద్ధంబగుచుంటి.

కా:-ఒక్కలాగుందమ్మా వాడిచిన్నతనం.

◆ ◆ ◆

కా: (భోజనంచేస్తూ) - అంతకూరా మాకే వేస్తున్నావేంటమ్మా !

న:-నాకెందుకురా నేనే ఆవకాయో ఏదో వేసుకొని తింటాను.

రా:-(వెటకారంగా) - ఈ ఆడవాళ్లందరూ ఇంతేనన్నయ్యా. వేడి కూరలూ పచ్చళ్లూ వాళ్ల కక్కర్లేదు. ఏ ఊరగాయతోనో ఇన్ని మెతుకులు తినడం తప్ప.

న:-అవున్రా బాబూ, మేముకూడా మీలాగ 'ఇదిలేదు అదిలేదు' అని తిండిమానేస్తే మీపనేమిటయ్యేదో. దానిమాటకేంగాని, పెద్దవాడా ! తమ్ముడికి జీతండబ్బు ఇవ్వాలిట ఎంతో అడిగేవా !

(కామశాస్త్రి మొహం వివర్ణమవుతుంది. మరెవ్వరూ మాట్లాడకుండా భోజనాలు ముగిస్తారు.)

◆ ◆ ◆

కా:-ఎంతకావాలి ?

రా:-డెబ్భయి రూపాయలు టెర్మ్‌ఫీజు కట్టాలి.

కా:-నూరు రూపాయలొద్దూ ?

రా:.......

కా:-(మనీపర్సుతీసి) - ఊఁ ఇంద, లెక్కపెట్టు. ఒకపదికాదు, రెండుపదులు కాదు ఏడూ.

రా:-(లెక్క పెట్టి ఇంకా నిల్చుంటాడు.)

కా:-ఏమిటింకా ?

రా:-అదికాదన్నయ్యా - మరేమో.

న:-(ఇంట్లోంచివస్తూ) - బాబూ వాడికి బట్టలులేవట్రా. కాలేజీకి వెళ్ళడాని కొక రెండు జతలేనా కుట్టించాలి. పాపం రెండేళ్ళయింది వాడికి కొత్త బట్టలు కొనేలేదు.

కా:-ఫీజు, బట్టలు, డబ్బు డబ్బు - ఎక్కడి నించొస్తుంది? నేనెలాగ మేష్టరు నయ్యాండికూడా, ఈ చింకి బట్టల తోనే పాతగుడ్డలతోనే కాలక్షేపం చేస్తున్నాను?

రా:-మరెలాగన్నయ్యా. నలుగురులో అసహ్యంగా ఎలాగ తిరగమన్నావు? మనూళ్ళో అయితే పరవాలేదుగానీ.

కా:-చాలులే కట్టిపెట్టు. చెమటోడ్చి నెల కెనభై రాళ్లు సంపాదిస్తున్నాను. బట్టలకీ, జీతాలకీ నువ్వూ, వంటకీ పెంటకీ ఇంట్లోవాళ్లూ ఉన్నదంతా ఊడ్చేస్తున్నారు. ఎక్కడినుండి తెచ్చేది!

న:-అలాగంటే ఎలాగరాబాబూ? (రామూరావువేపు తిరిగి) పిల్లడు చిన్న బుచ్చుకుంటాడు. ఏదోలాగ సరిపెట్టు కోవాలిగానీ.

కా:-అవునమ్మా. (పెడమొహంపెట్టి) అంతా నువ్వే వాడికి మప్పేవు, (కోపంగా) అందరూ నన్ను దోచేస్తు న్నారు. ఊఁ, పట్టుకుపొండి (మనీ పర్సులోంచి ఇరవై రూపాయలు టేబిలుమీద పడేస్తాడు) అఘోరించు.

న:-(ఇంట్లోకి వెళ్ళిపోతూ) ఇవ్వవలసిం దెలాగూ ఇస్తాడు. ఎందుకో ఆ విసుగు.

♦ ♦ ♦

రా:-సాయంత్రం రైలుకి వెళ్ళిపోతా నన్నయ్యా.

కా: ఊఁ హూఁ, సరే.

రా:-(సంకోచిస్తూ)-మాకు పరీక్షలు దగ్గర కొస్తున్నాయి.

కా:-అదే నేనూ చెప్దామనుకుంటున్నాను. తిరుగుళ్లు తగ్గించి కొంచెం చదువు మీద శ్రద్ధుంచు. జీతాలు కట్టడం, డ్రెస్సులు కుట్టించడమే కనిపిస్తోంది గాని.

రా:-మరీ, పరీక్షలముందు పుస్తకాలెవరూ ఇవ్వరన్నయ్యా.

కా:-ఆ వెంకట్రావు దగ్గరకెళ్లి చదువుకో. ఏదో మెల్లిగా సర్దుకొని సంపాదించు కోవాలిగాని, ఎలాగ!

రా:-రెండు మూడు 'ఇంపోర్టెంట్ టెక్స్టు బుక్స్'న్నా కొనాలన్నయ్యా. ఎంతకని వీళ్లనీ వాళ్లనీ అడగడం. ఒక పాతిక రూపాయలిస్తే.

కా:-(కళ్లెర్రచేస్తాడు. నోటంట మాటలు రాక రాక వస్తాయి) - మళ్లా డబ్బు!

నోరు మూసుకోని అవతలకిపో! నన్ను మరేమీ అడక్కు.

(రామం ఇంట్లోకి పోతాడు)

రా:-అమ్మా, నేను వద్దంటూవుంటే కాలేజీలో జాయిన్ చేశారు. పుస్తకాలకి డబ్బడిగినా, జీతానికనడిగినా కర్రు బుస్సు మంటూంటే నేను భరించలేను.

న:-వాడు కోపంమీదేదో అంటే ఎందుకురా నీ కంత పౌరుషం?

రా:-అవునమ్మా, నువ్వుకూడా నన్నే అంటావు. అందరూ ఒక్కలాంటి వాళ్లేచేరేరు (కాలు నేలపై కొడతాడు) నేను మరి కాలేజీలో చదవలేను. తిట్లుపడలేను. నిన్న నిచ్చిన డబ్బుకూడా తీసుకో నాకక్కర్లేదు (జేబులోని నోట్లు నేలపైపడేసి, వెనుతిరిగి చరచరపోతాడు.)

న:-(విస్తుపోయి) - ఒరేయ్, రామం!

(కొన్ని క్షణాలు గడుస్తాయి)

కా:-(గబగబా ఇంట్లోకివస్తూ) - అమ్మా, నువ్వే వాడికంతా నేర్పుతున్నావు.

న:-ఏమిట్రా నాయనా.

కా:-ఏమిట్రా అని ఇంకా అగుడుతున్నావు! నా దగ్గరేమీ 'డబ్బు చెట్టు' లేదు, దులపడానికి. ఎక్కడి నుంచి పట్టుకొచ్చేది, బట్టలకీ, పుస్తకాలకీ వాడికి? ఇంట్లోకేమిటికొనేది?

న:-చిన్నవాడితో నీ కేమిటి బాబూ! లేరా ప్రవేశపెట్టేక డబ్బులేదంటే ఎలా?

కా:-అవునమ్మా, కాని నేనేమీ మరి సంపాదించలేను. నేనీ సంసారం చెయ్యలేను. నువ్వే చూసుకో. ఈ వున్న 'ధనరాశి' ఏదో నువ్వే ఖర్చుపెట్టుకో (మనీపర్సు క్రింద పడేస్తాడు.) అందరూ ఒక్కలాటివాళ్లేచేరేరు (వేగంగా వెనక్కిపోతాడు.)

—o—



# కాలిబాట

## "పగడండీ"

మూలం : శ్రీ కమలాకాంతవర్మ

అనువాదం : "ప్రవాహ్"

(ఏప్రిల్ సంచిక తరువాయి)

కానీ నేను నీ వ్యక్తిగత సార్వజనిక జీవిత బాటపై ఒక విఘ్నస్వరూపముగాయుండి నీ ఆత్మ వికాసమును ఆటంక పరచవలెనని నేను కోరుటలేదు. నీ చైతన్యదు నా హృదయ జన్య ప్రేమచ్ఛాయతో మలిన మొనరించ వలయునని కోరుటలేదు. నీమధుర సంగీత తరంగములో నేనొక అపస్వరమై దానిని అందవిహీనమై చేయవలయునని కోరుటలేదు. - నేను నీకు హృదయపూర్వకముగా వీడ్కోలు యిచ్చుచున్నాను. ప్రపంచములోకి జని పరుల ప్రయత్నములకై ఉపయోగపడి జీవిత సార్ధకతను సంపాదించుకొనుము. యివే నా అభిప్రాయములు. నా శుభాకాంక్షలు యిదే క్షమించాలి ... ఆశీర్వాదం.

మరి యొక విషయము చెప్పవలయు ననుకొను చున్నాను. నా హృదయ హీనతను మరువవలయును. వీలైతే క్షమించవలయును. నాకుకూడా హృదయమున్నది. అందులో కొన్ని ఆకాంక్షలు యున్నవి. కాని నేను కేవలము వాటిని అణచివేసినాను. వాటిని స్ఫురణకురానివ్వను. అధరోష్టముల నుంచే వాటిని తుడచివేసినాను. నీ కర్తవ్యపధమును నేను నా అశ్రుధారలతో మలిన మొనర్చ జూచుట లేదు. పగడండి నా వ్యధను గ్రహించుటకు అంతా మరచి పోవలయును.

ప్రపంచము నీ మార్గమును నిరీక్షిస్తూంది. ఆకాశము నిన్ను ఆహ్వానించు చున్నది. వెళ్ళి కర్తవ్యపాలనగావించుము. ఒకవేళ ప్రపంచము నిన్ను అణగ ద్రొక్కితే బాధపడవద్దు. ఏడ్పించితే ఏడ్వవద్దు. దారితప్పిన అమాయక బాటసారులకు గమ్యస్థానమున బాటను చూపించు. యిల్లువదలి విదేశము వెళ్ళుగోరువారికి మార్గము చూపించుము. పరులకు సేవచేయి కాని వ్యక్తిగత స్వార్ధంకోసం ఏడ్వవదు. మరి యింకొక మాట ఒకవేళ నీ హృదయములో ప్రేమభావము ఉదయించినట్టయితే నీ కాయశక్తులను వినియోగించి దానిని తీసివేయుము. అలా తీసివేయలేకపోతే అక్కడనుంచి మరియొక చోటకు వెళ్ళిపోవుము.

పగడండీ ధన్యవాదములు. నీవు నీ జ్యోతిర్మయ భవిష్యత్తులో యిస్పష్ట అతీతమును మరచిపోవలయును. అంతా మరచి పోవలయును. పటదాదాను భావిని గూడ మరచి పోవలయును. నేనెవరను? నా కర్తవ్యమేమిటి యనునది గుర్తుంచుకొన వలయును. మంచిది వెళ్ళు. ధన్యవాదములు ఈశ్వరుడు నీకు మేలు చేయుగాక.

భావి మెదలకుండా యున్నది. అర్ధరాత్రి స్వప్నల నీరవతయందు వాని స్వరమింకా ప్రతిధ్వనించునట్లు గోచరించుచున్నది. ఆధ్వని అంతరిక్షమునకూడా తిరుగుచున్నట్లున్నది నేనేమి చెప్పలేక పోయినాను. ఆలోచించలేక పోయినాను. నిదురమత్తు వ్యాపించినది. కొయ్యలాగా పడినాను "మంచిది వెళ్ళు, ధన్యవాదములు, ఈశ్వరుడు నీకు మేలు చేయుగాక" అను వాని అంతిమ శబ్దములు అర్ధరాత్రి శూన్యాంధకారములో మెరుపులాంటి అక్షరములవలె నాలుగు వైపులా వ్రాయబడినట్లుగా గోచరించుచున్నది.

ఎన్ని రోజులు అయినది బాగా గుర్తులేదు. కాని మరల ఒకయుగము గడిచినట్లుంది. నానయన సమక్షమందు ఆ స్వరూపము నేడుకూడ నాట్యము చేయుచున్నది. చెవులలో ఆశబ్దములు ప్రతిధ్వనించు

చున్నవి. నేను యిప్పుడు రాజధానికి రాజమార్గమును. నాకు రెండువైపులా స్నేహితురాండ్రవలె రెండు చిన్న మార్గములు యున్నవి. ఎండ వాన నుంచి రక్షించు కొనుటకు రెండువైపులా వృక్షముల పంక్తులున్నవి. ప్రకాశము కొరకు కరెంటు స్తంభములు కలవు. యింకా ఎన్నో రకముల వైభవవిలాస వస్తువులుయున్నవి. నిత్యము నన్ను అలంకరించెదరు. నారక్షణకొరకు వేలరూప్యములు వెచ్చించ బడును. రాజువలె ఆదరింపబడుదును. నేను నగరమునకు ప్రధాన మార్గమును. నానుండే యితర మార్గములు వెడలినవి. నేను సభ్యత్వపు స్తంభమును. రాజశక్తి ప్రాణమును. ఆలోచించే అందుకు అవకాశముగూడ లభించదు. జన సముదాయము నన్ను అణగద్రొక్కుచూ ఒకవైపునుండి రెండవవైపుకు వెళ్ళును. నేను అబ్బా అని అనను. ఈజన సమూహంలో నా అనే వాళ్ళు ఒక్కరూలేరు? నా మందుచున్న నిర్విరామ జీవితంపై సహానుభూతి చూపేవారు ఒక్కరూలేరు. కాని నేను బాధపడను. సంతోషంగా వుండుటకు యత్నించెదను. వేదనా జ్వాలలమీద చిరునవ్వు యనెడి బూడిదను వెదజల్లెదను. వీలైనంతవరకు అతడు చెప్పినవన్ని చేయుచున్నాను. కాని కేవలము అతణ్ణిమాత్రము మరువలేక పోవుచున్నాను.

రసాలమునందు గడ్డిగాదము మీద ఆ నా జీవితము పక్షులకలవరము. లతల జగడము. వటదాద కథలుతురి.........ఏమి చెప్పను. మరచిపోలేని మాటలెన్నోయున్నవి. నా జీవిత సంగీతస్వరము తిరిగి రాగ తాళానుయుక్తంగా యుండును. తాళానుయుక్త స్వరము వచ్చి మళ్ళీతిరిగి వెళ్ళిపోతుంది. కాని ఎవరి తలలు ఊగుటలేదు. ఎవరికేం తెలుసు. అదియొక సమయము. నేనప్పుడీవిధంగా లేను.

అప్పుడు నేనీవిధంగాలేను. నేను ఎల్లప్పుడూ యిదే విధంగాయున్నట్లు ప్రజలు తలంచెదరు. లావు వెడల్పు విశాలము అవనిసీమను దాటి అనంతమును పొంతం చేయుచు విశ్వపు ఒకమూలనుంచి రెండవమూలవరకు పరుండినాను అని అనినట్లుగా యుండెడిది నాప్రాచీన చరిత్ర. ఎవరు ఏమైనా అనుకోనీ.

నేనప్పుడు యింత పొడవులేను. మరియింత విశాలముగ గూడలేను. ముఖముమీద యిటికెరాళ్ళ వంటి ఎర్రదనములేదు. మరిశరీరము మీద కంకర రాళ్ళవంటి ఆభరణములులేవు. నాకు కుడి ఎడముల వైపున యిటు కినబడుచున్న ఈ వృక్షముల పంక్తులుగూడ అప్పుడు లేవు. మరి ఈ ప్రక్కల యున్న చిన్న చిన్న రోడ్లుని (ఫుట్‌పాథ్) కూడా లేవు. అప్సరసలవలె నాచుట్టూ అలంకరించ బడియున్న, ఈదుకాణములుగూడాలేవు. ఉంగరమునకు పొదుగుమణివలె శోభనుచేకూర్చి ఈ ఉపవనములుకూడ అప్పుడులేవు. అప్పుడు నేను ఒక చిన్న పగడండి (కాలిబాట)ను. సన్నని పలుచని సుకుమారిని, కొంటెదానను.

నేను ఎప్పటినుంచి యున్నది నాకు గుర్తులేదు. కాని చూతేము ఈవల గ్రామీణయువతులు నది నుంచి నీరుతెచ్చుటకు వెళ్ళియుండవచ్చు. అంటే ఏదో ఒక చిన్న నగణ్యఘటన జరిగిన తరువాత ఒక్క ఆచారణ బయలు దేరెను. దాని వలన ఒక ధర్మము గూడ బయలుదేరెను. అదేవిధంగా ఒకయువతి నీరునింపుకొని వచ్చినమీదట గ్రామీణయువతులందరు కుండలలో నీరునింపుకొని వయ్యారంగా నాట్యం చేస్తున్నట్లుగా ఒకేదారిన వచ్చుచుండవచ్చు. అప్పటినుంచి నా జీవితపుకథ ప్రారంభమయినట్టుగా తెలియవచ్చుచున్నది. నా అతీత ఆకాశంలో రెండు నక్షత్రములు యిప్పుడుగూడ నా జీవితాంధకారంలో మిణుకు మిణుకు మంటున్నాయి. ఈ రసాలము మరి ఈ గ్రామము నా పరిచితులతో నిండియున్నది. కాని నాఘనిష్టత యిద్దరితో మాత్రమే. అందులో ఒకరు వటదాద. (వటవృక్షము) రెండవది భావి.

# తెల్ల రోజా!

రచయిత్రి :
ఇన్‌గే షోల్స్

అనువాదము :
డాక్టరు వి. ఎన్. శర్మ

(గతసంచిక తరువాయి)

## చెల్లి కాలేజి చదువు

పెద్ద కొడుకు అలాగే తన వ్యక్తిత్వాన్ని నిలుపబెట్టుకోవడానికి నానా బాధల్ని ఇంతవరకు అనుభవించాలసి వచ్చింది. దాంతో ఈ కష్టాలు అంతమవుతాయా ?

"ఈ పిల్ల ఇట్టి కష్టాల్ని ఎదుర్కొనకుండా వుంటే ఎంతో బాగుంటుంది" అని మా అమ్మ ఆశ. అందుకోసమే ఇలా ఆ జోలపాటను పాడుతూ ఆనంద బాష్పాల్ని రాల్చుతూ వుంది. సోఫీ రేపు పెద్ద చదువుకోసం మ్యూనిచ్ నగరం వెడుతుంది. అక్కడ ఆ పిల్ల చదువు చక్కగా కొనసాగాలి...... కాని అంత అదృష్టం తనకు వుంటుందా? ఏమో? ఎవరికి తెలుసు? ఈ జీవితంలోని మాయ. ఆ మాయ ఏ రూపాల్లో మన మధ్య నాట్యం చేస్తూ వుంటుందో... ఇదే ఆ సమయాన మా అమ్మ భయం......

చెల్లిసోఫీ మ్యూనిచ్ ప్రయాణానికి చేయాలసిన సన్నాహాన్నంతా అమ్మ యథాతథంగా చేసింది. సోఫీ మేము దానికి పుట్టినరోజు పండుగనాడు ఇచ్చిన నగని వేసుకుని ప్రయాణానికి సిద్ధంగ వుంది. అమ్మ ఇంతవరకు ఎంతో నిబ్బరంగావుంది. ఇక అది ఎలా వస్తుంది? సోఫీ కష్టాలపిల్ల. చిన్నప్పటినుంచి తను ఏదిమంచిది అనుకుంటే దాన్ని తూ.చ. తప్పక నెరవేర్చటానికి సోఫీ చూపిన ధైర్యం, సాహసం, ఆ పిచ్చి శక్తితో తన దోవకి అడ్డుగా వచ్చిన ప్రతి ఘటాల్ని ఎలా త్రోసుకుంటూ ముందుకు నడుస్తూ వుందీ మాకు బాగా తెలుసు. ఆ శక్తి మూలానే ముందు చేయాలసిన పనిని చక్కగా చేయగలుగుతుందని అమ్మకి బాగా తెలుసు. ... కాని కాలం. మాయకాలం. ఈ మాయ చక్రాన్ని నడుపుతూ వున్నవాళ్లు ఎట్టి అఘాయిత్యాలనైనా చేయటానికి భయపడేవాళ్లు కాదు. అయినా ముందుకి నడవాలి. మన ఆశయాల్ని, ఆదర్శాల్ని ఎట్టి కష్టాల్ని ఎదుర్కొనవలసివచ్చినా మరచిపోకూడదు. మంచి అనేది వుంది. చెడ్డఅనేద వుంది. ఈ రెంటిలో చెడ్డకే ఈ కాలంలో మనమీద పెత్తనం చేస్తూ వున్నవాళ్లు విలువకట్టినా, తుట్టతుదకు గెలిచేది మంచి అనే దేవరహస్యాన్ని మనం మరచిపోకూడదని అమ్మ ఎప్పుడూ అంటూ వుండేది. దానికోసం అహో రాత్రాలు కలవరిస్తూ వుండేది. అమ్మ చేసే పూజలు, పునస్కారాలూ దీని కోసమే. అంచేత సోఫీ మమ్మల్ని విడిచిపెట్టి ఆ వూరికి బయలుదేరుతూ వుండే సమయాన అమ్మ ఏదో విధంగా మనస్సు సమాధాన పరచుకుని సోఫీని కౌగలించుకుంది. తల నిమురుతూ తనకెంతో ఇష్టమైనపాటని "ఈ పిల్ల వెడుతూవుంది. పక్షికి మల్లె వెడుతూవుంది లోకాన్ని చూడటానికి. ప్రభూ! ఈ పిల్లని చూసుకొనే బాధ్యత నీదే. దీనికేమీ కష్టాలురాకుండా చూసుకొనే బాధ్యత ఇక నీదే" అని పాడుతూ కంట తడిబెట్టింది.

సోఫీకి ఆ పాటని వింటూవుంటే ఎన్నెన్నో ఆలోచనలు బుర్రలో రేకెత్తిపోతూవున్నాయి. ఒక వైపు చీకటి. కటికచీకటి తనని వుక్కిరి బిక్కిరి చేస్తూవుంది. అంతా అయోమయం. దోవా తెన్నూ ఎలా అగపడుతుంది యీ గాఢాంధకారంలో. మరో వైపున వెలుగుచొచ్చుకొని వస్తూ వుంది. చీకటిని పటాపంచలంచేయటానికి తన శక్తినంతా వుపయోగిస్తూ వుంది. ఈ రెంటికి మధ్య సోఫీ తికమకలు పడుతూవుంది. ... అయినా ఇలాటి పైపై వూతలకి లొంగిపోయే ఘటమైతేగా సోఫీది. అమ్మని ఆదుర్దాపడవద్దని చెప్పింది. ఎంతో కష్టంమీద

అమ్మదగ్గర సెలవు పుచ్చుకుని బయలుదేరింది. ఆ సమయాన సోఫీ కళ్లని చూసే తీరాలి. అలా కళ్లు కళకళలాడుతూ వుండటం ఎప్పుడూ చూశాంకాం.

మ్యూనిచ్ రైలు స్టేషనులో అడుగుబెట్టిందో లేదో, సోఫీకి ప్లాటుఫారంమీద స్వాగతం ఇచ్చింది తమ్ముడు హాన్స్. సోఫీ సామాన్లని క్రిందికి దింపుతూ "సోఫీ! నీతో పరిచయంచేసుకోవాలని నా స్నేహితులు ఇవ్వాళ సాయంకాలానికి నా గదిలోకివస్తారు" అని హాన్స్. మందహాసంచేస్తూ అన్నాడు. సోఫీకి అన్న అంటే ఎంతో ఇష్టం. అతనికీ తనకీ మళ్లె ఎన్నో వున్నతాశయాలు వున్నాయి. వాటిని కార్యరూపాన బెట్టడానికి సదురూ బెదురూ లేకుండా చూపిన త్యాగం తనకి బాగా తెలుసు. ... అతని ప్లానుకి సరేనని తలనూపింది. ఇద్దరూ కలిసి వాళ్ల బసకి వెళ్లిపోయారు.

ఆ రోజు సాయంకాలానే హాన్స్ స్నేహితులు హాన్స్ గదిలో సమావేశమయ్యారు. వాళ్లకి చేయాలసిన అతిథి సత్కారాన్ని సోఫీ తన మీదే వేసుకుంది. అమ్మ తన పుట్టిన రోజు పండుగనాడు స్వగంగా తయారుచేసి తనకిచ్చిన ఫలహారాల్ని బల్లమీద సర్దింది. కాఫీని అందరూ పుచ్చుకున్నారు. ఫలహారాల్ని తనివిదీరా భుజించారు. తన ఆశయాలకీ, హాన్స్ మిత్రుల ఆశయాలకీ ఎంతో అవినాభావ సంబంధం వుండటం గుర్తించాక, సోఫీ వాళ్లతో చనువుగా మాట్లాడింది. వాళ్లూ మనసిచ్చి సోఫీతో వాళ్ల చదువులని గురించి కబుర్లు చెప్పారు. ఇలావాళ్లు కబుర్లు చెబుతూంటూవుండే సమయాన క్రిస్టల్ (అసలుపేరు క్రిస్టాఫ్) ఏం అనుకున్నాడో ఈ కబుర్లని కట్టిపెట్టి గ్రంథపఠనంచేయటం బాగా వుంటుందని సలహా ఇచ్చాడు. అందరూ క్రిస్టల్ సలహాకి తలవూడించారు. ఏం చదవాలనే సమస్య వచ్చింది. ఇటువంటి సమస్యల్ని తేల్చడంలో హాన్స్‌ది అందెవేసిన చేయికదూ! అంచేత హాన్స్ చప్పునలేచాడు. పద్యాల్ని చదవటం మంచిదన్నాడు. తనే ఆ పని ప్రారంభిస్తానంటూ జేబులోనుంచి తను జాగ్రత్తగా దాచివుంచుకున్న కాగితాలని బైటికితీసి చదవటానికి ప్రారంభించాడు.

"ఆ కాలం చెడ్డకాలం,
ఎక్కడ చూసినా చెత్తాచెదారం,
దాన్లో దాగివుంది పురుగు,
ప్రాణాల్ని చప్పున పీల్చివేసే పురుగు,
నివురు కప్పిన నిప్పుకి మల్లె
ఇటూ అటూ దొర్లుతూ,
తనపని తూచ తప్పక చేసుకుంటూ
వుంది ఆ పురుగు ఆ విష పురుగు.
విధి విరామంలేని వర్షం,
అంతూ తంతూలేని తుపాను,
భరించజాలనంత ఎండ,
ఇవే దానికి బలాన్ని ఇచ్చాయి,
ఎవళ్లకీ అగపడి తేగా
ఈ పురుగు, ప్రాణాల్ని పీల్చివేసే ఈ
పురుగు,
దేశాన్ని చిచ్చుపెట్టింది.
రోగాలు, అన్ని రకాల రోగాలు
తెచ్చి పెట్టింది
ఆ పురుగు, ఈవిష పురుగు.
వెలుగుపోయింది. దాంతో చీకటి
వచ్చింది.

(సశేషము)

# అశ్రుతర్పణం

'పద్మ - నరేశ్'

(గతసంచిక తరువాయి)

---

నాగేష్, సుందరిల స్నేహం నానాటికి జాస్తి కాజొచ్చింది. నాగేష్ నివురుగప్పిన నిప్పని పాపం సుందరికేం తెలుసు! సుందరికి నాగేష్‌లో ఏదో క్రొత్తదనం గోచరించింది. తన హృదయ ఫలకం మీద నాగేష్ ఆకృతిని చిత్రించుకుంది. అహోరాత్రాలు అతనికోసం పరితపించేది. అతనికీ తనకూ చాలా దగ్గరి సంబంధం ఏర్పరచుకుంది సుందరి. అప్పుడప్పుడు యిద్దరూ ఏకాంత ప్రదేశంలో కలుసుకొని ఏవేవో మాట్లాడుకొనేవారుకూడా.

ఓనాటి సాయంత్రం యిద్దరూ చెరువుగట్టున కలుసుకున్నారు. సుందరి నాగేష్ ఒడిలో చేరి ఏవో మాటలు చెప్తోంది. "నాగేష్! మనమెప్పుడు యిలాగే వుంటే ఎంత హాయిగా వుంటుంది." ఆ మాటలు నాగేష్ హృదయాన్ని కలవరపరిచేయి. అతని ముఖ వైఖరి మారింది.

సుందరికి వెంటనే సమాధానం రాకపోయేటప్పటికి అతని ముఖంలోకి చూచింది. "ఏమండీ! అలా వున్నారేం?"

"అబ్బే ఏమీలేదు!" అంటూ తప్పించుకున్నాడు నాగేష్.

"నాగేష్! ఈ చీర ఎలావుందో చెప్పు."

"బాగానే వుంది."

"నాకు గులాబీ రంగు చీరలంటే యెంతో యిష్టం."

"అలాగేం!"

"నాకామాదిరి చీర ఒకటి తెచ్చిపెట్టరూ!" ఎంతో ప్రియంతో అడిగింది సుందరి.

"తప్పక సుందరీ! నాకూ గులాబీ పూలంటే చాలా యిష్టం-"

"నీవీ చీరరంగులో రత్నంలా..." అంటూ అతడ ఆగిపోయాడు. సుందరది గమనించింది. "చూడు నాగేష్! నాకళ్లలోకి చూడూ! నాకంటే అందంగా వున్నవారెవరయినా నీ హృదయంలో మెదలుతున్నారా?"

"లేదు. సుందరీ లేదు!" నాగేష్‌లో తొందర జాస్తయింది. మెల్లగ సర్దుకున్నాడు. "ఆనాడు రాత్రి నీవు తడిసివస్తే నీలో నాకేదో క్రొత్త అందం గోచరించింది. ఆనాడే నీ అందాన్ని ఆస్వాదించాలనుకున్నాను. ఆనాడే నా హృదయంలో నీ చిత్రాన్ని చిత్రించుకున్నాను." సుందరి అతని మెడ చుట్టూ చేతులువేసింది. నాగేష్ ఆమెను తనహృదయానికి అదుముకున్నాడు.

నాగేష్ మాటలకు సుందరి యెంతగానో ఆనందించింది. అతని మోసపు మాటలకు యెంతగానో మోసపోయింది.

సుందరి తల్లి ఎలిమెంటరీ స్కూలులో టీచరు. ఆమె ప్రొద్దున పదిగంటలకు పోతే తిరిగి సాయంత్రం అయిదుగంటలకు వస్తుంది. తండ్రి చిన్ననాడే జీవితాన్ని చాలించాడు. తమ్ముడొకడున్నాడు గానీ బదుద్ధాయిలా వూరుతిరిగేవాడు. ఫిప్త్ ఫారంలోనే మూడు మాట్లు కూర్చున్న ఘనుడు.

ఒకనాడు మధ్యాహ్నం సుందరి స్కూలుకి ఎగ్గొట్టి ప్రియునిరాకకై నిరీక్షిస్తూ కూర్చుంది. దురదృష్టవశాత్తు ఆమె తమ్ముడి కోసం రత్నం ఆయింటికొచ్చాడు. సుందరి లేదని జవాబు చెప్పడంతోటే వెను తిరిగి గడపదిగ పోతూంటే నాగేష్ యెదు

రయ్యాడు. రత్నంని చూడటంతోటే నాగేష్‌కి గుండెలాగినంత పనయింది. నాగేష్ చేతిలోవున్న పొట్లాన్ని చూచి "ఏమిటి నాగేష్! ఆ పొట్లం? ఏమిలా వచ్చావే?" అంటూ చేతిలో పొట్లం తీసుకోబోయాడు.

'అబ్బే ఏమీలేదు!' అంటూ పొట్లం వెనక్కి లాక్కుంటూ "నువ్వేం యిలా వచ్చావు?" అంటూ ఎదురు ప్రశ్న వేశాడు.

"నేను యీ యింట్లో వుండే అబ్బాయికోసం వచ్చాను. వాడు మాక్లాసు మేటులే!" అన్నాడు రత్నం.

"నేను యీ యింట్లో వుండే మేష్టారమ్మకోసం వచ్చాలే." అంటూ రంగు ఫిరాయించాడు. "నాగేష్ ఉండు యీ పొట్లం యిచ్చేసి వస్తాను." అంటూ లోపలకెళ్లాడు నాగేష్ తన దురదృష్టాన్ని తలంచుకొంటూ. కాసేపట్లో బయటికిరాగానే రత్నం, నాగేష్ కలిసి అలా బయలుదేరి పోయారు.

6

నాగేష్ తండ్రి ముకుందరావు. పేరుబడిన సర్కిల్ యిన్స్పెక్టరు. ముకుందరావుకు తాత ముత్తాతల ఆస్తి బాగా వుండటంవల్ల హాయిగా కాలం గడుపుతున్నాడు.

"నాగేష్! యిలారా ఓసారి!" కాసేపటికి నాగేష్ అతని ప్రక్కన నిలుచునని,

"ఏం నాన్నగారు! పిలచారే!" అతనితట్టు ముకుందరావు కళ్లద్దాలనుంచి చూచాడు.

"చూడు ఈ ఫోటో బాగుందా?" అని ఓ యువతిఫోటోను చేతికిచ్చాడు. నాగేష్ దాన్ని యిటూ అటూ త్రిప్పి,

"దేనికి నాన్నగారూ?"

"చెప్పరా! బాగుందా లేదా?"

"దానికేం బాగుంది."

"ఏది-ఫోటో నాకేక దానిలోవుండే అమ్మాయా?" ముకుందరావు గట్టిగా నవ్వాడు. నాగేష్‌కు విసుగెత్తింది.

"అన్నీ బాగున్నాయి నాన్నగారూ!"

"నిజమే నిజమే దేనికి బాగుండదూ! ఇంతకూ దేనికో తెలుసా! ఇంకో రెండునెలలకు నీకు వివాహం జరిగిపోతుంది."

నాగేష్ హృదయం తక్కున ఆగిపోయింది. తన కిప్పుడు వివాహమా? అదెలా సాధ్యమౌతుంది!

"నాకెందుకు నాన్నగారూ! ఇంత తొందరలో పెళ్ళి! పరీక్ష పాస్ కానీండి."

"నిజమే! నిజమే! నీకు పెళ్లి దేనికిరా? అక్కడా యిక్కడా బడుద్ధాయిలా తిరగమంటే! హూ! ఏరా! నీకు పెళ్లి దేనికొద్దురా? ఇలా గాడిద మోస్తరు పెరిగిపోతుంటే యితరులేమనుకొంటారు?"

"ఇతరులేమనుకుంటే మనకు దేనికి? నాకిప్పుడు పెళ్లి వద్దు! అంతే!"

"నిజమే! నిజమే! యితరులేమనుకుంటే నీకు దేనికి? పిచ్చివాడు! ప్రపంచానికి నోరెంతో తెలుసా! ఈ లోకమంత! అందులో నీవెంతో! నీవూ ఒక సూక్ష్మ జీవివే! ఇక లోకం నోరు మూయడానికి నీవెవరో? ఇకనయినా పిచ్చిమాని నీ స్నేహితులతో చర్చించి, ఆ మీదటే చేసుకోవోయి. ఆ! యిక వెళ్లు."

నాగేష్‌కు నెత్తిన పిడుగుపడ్డట్టయింది. తనకిప్పుడు యిరవైయ్యో యేడు దాటుతుంది. గడ్డాలు, మీసాలూ బాగా వచ్చాయి. తనకూ పెళ్లి చేసుకోవాలని యిష్టమే. కానీ యిది సమయంగా తోచ లేదు నాగేష్‌కు. అందుకనే తనకిప్పుడు వద్దన్నాడు.

ఇతని పెళ్లి విషయం అందరికీ తెలిసి పోయింది. కొందరు చేసుకోమన్నారు. కొందరు అప్పుడే యేం తొందరన్నారు. మరికొందరు నీ యిష్టం అన్నారు.

కానీ నాగేష్ మటుకు యిప్పుడు పెళ్లి చేసుకో కూడదనుకున్నాడు,

7

ఓ నాటి సాయంత్రం రత్నం, మూర్తి బజారులో కలుసుకున్నారు. మాటల్లో నాగేష్ సుందరి యింటికి వచ్చిన విషయం గురించి చెప్పాడు రత్నం మూర్తికి.

"సుందరి! ఆమె యెవరు?" అన్నాడు మూర్తి ఆశ్చర్యంతో. రత్నం తనకో స్నేహితుడున్నాడని ఆ అబ్బాయి అక్క సుందరని, ఆ అమ్మాయి ఫిఫ్త్ ఫారం చదువుతూవుందనీ, చూడబోతే సుందరికీ నాగేష్‌కీ ఏదో సంబంధం వున్నట్లుగా తోస్తుందని చెప్పాడు రత్నం. మూర్తికి నాగేష్ మీద కొంత అనుమానంకలిగింది. గీతను నాగేష్ కాలదన్నడంలో ఏదో కొంతకారణం వున్నదనుకొన్న ఆలోచన నేడు రూఢి అయింది. బహుశా సుందరి నేమైనా వలలో వేసుకున్నాడేమో నాగేష్. రత్నంతో నాగేష్‌ను కాస్త గమనించి వుండమని చెప్పాడు మూర్తి. నాగేష్ చేసినపనికి ఎంతో నొచ్చుకొన్నాడు రత్నం.

మూర్తి నాగేష్‌తో మాట్లాడుదామని నాగేష్ యింటిత్రోవ పట్టాడు. రత్నం తనకు పనివుందని అతిజరూరుగా వెళ్లాలని పట్టుపట్టడంవల్ల మూర్తి అతన్ని వదలక తప్పలేదు. మూర్తి నాగేష్ యింట్లో ప్రవేశించేటప్పటికి ముకుందరావు బయట వరండాలో కూర్చొని చుట్ట కాలుస్తున్నాడు. మూర్తి ఆయనవద్దకు పోయి "ఏమండీ నాగేష్ వున్నాడా యింట్లో?" అన్నాడు. "ఇంట్లోలేడే. ఏంపనేమి టోయ్ యిలావచ్చావు. దారి తప్పినట్లున్నావే!" అన్నాడు ముకుందరావు నవ్వుతూ. "ఊరికే నే పొద్దు పోకవచ్చాను. ఎక్కడికి పోయినాడేమిటి?"

"మావాడిని చూడటానికి తెలిసినవాళ్ళొచ్చారు, వాళ్లీ రోజు వూరికి వెళ్తుంటే స్టేషను వరకు సాగ నంపబోయాడులే! వస్తాడు కూర్చో — ఇంతకూ బాగా చదువుకుంటున్నావా?" ప్రశ్నించాడు ముకుందరావు.

"నాగేష్‌ను చూడ్డానికా! దేనికి?" మూర్తి ఆశ్చర్యంతో అడిగాడు.

ముకుందరావు నవ్వి "ఇంకా తెలియదటోయ్! వయసొచ్చిన వాళ్ళయి పోతిరి మీరు. ఇంక పెళ్ళి వ్యవహారాలు వుండలేదటయ్యా!" ఈ మాటలతో మూర్తి నిర్జీవుడయ్యాడు. ముకుందరావు వద్ద శలవు పుచ్చుకుని యింటిత్రోవ పట్టాడు.

నాగేష్‌కి పెళ్లా! గీత గతేంకావాలి? అసలీ సుందరెవరు? స్కూల్లో ఎప్పుడూ చూచినట్లులేదే! ఇప్పుడు ఏంచేయాలి? నాగేష్ తండ్రికి నాగేష్ విషయం చెప్పాలనుకున్నాడు. కానీ అది అతని భవిష్యత్తుకు తీరని మచ్చ యేర్పడుతుందేమోనని భయపడ్డాడు. గీతకు ఈ విషయం తెలుపుదామా? వద్దా? అని సందేహించాడు.

చివరికీవిషయం గీతకు చెప్పాలని నిశ్చయించుకున్నాడు. చెప్పాడు కూడా. గీత ఒక్క పెట్టున పెద్దగా యేడ్చింది. అసలే కృంగి కృశించి పోతున్న గీత తలమీద పిడుగుపడ్డట్లయిందియీ వార్త వలన. లక్ష్మి అనేక విధాల ఓదార్చింది. మూర్తి గీతకు ధైర్యం చెప్పి నాగేష్‌ను ఎలాగయినా నీవాడినిగా చేస్తానని మాటయిచ్చి బయలుదేరాడు.

ఎలా చేస్తాడు? అసలు నాగేష్ వొప్పుకుంటాడా? ఇంతకు సుందరి ఎలాంటి స్త్రీయో? సుందరితో మాట్లాడితే - అసలు ఏమని మాట్లాడాలి? ఒకవేళ గీత విషయం సుందరికి తెలిపితే తన మిత్రుడు నాగేష్‌ను హీనంగా చూడదూ? అని పరిపరి విధాలుగా ఆలోచించాడు. చివరకు సుందరితో ఎలాగయినా మాట్లాడాలని నిర్ధారణ చేసుకున్నాడు మూర్తి.

♦ ♦ ♦

ఆనాడాదివారం మూర్తి సుందరి యింటికి వెళ్ళాడు, మిత్రుడు రత్నం చెప్పిన గురుతులబట్టి. లోపల సుందరి యేదో పుస్తకము చదువుకుంటూ

వుండి మూర్తినిచూచి "ఎవరండీ మీరు ? " అని ప్రశ్నించింది.

"సుందరిగారెవరండీ ?"

"నేనే - ఏంకావాలి ?"

"మీరేనా ? అయితే మీతో ఒక ముఖ్యవిషయం మాట్లాడాలి"

"నాతోనా ! అసలు మీరెవరు ?"

"నాపేరు మూర్తి లెండి ! నాగేష్ స్నేహితుడ్ని"

నాగేష్ పేరు వినగానే సుందరి ఆశ్చర్య పడింది. దేనికో బెదురుతూ మూర్తి వైపు చూచింది. మూర్తది గమనించక పోలేదు.

"సరే ! రండి !" అంటూ తన రూంలోకి తీసుకుపోయింది మూర్తిని.

"మీతో నాగేష్‌కు స్నేహం వుందటగా !" సీరియస్‌గా అడిగాడు మూర్తి.

"దాంతో మీకేం సంబంధం ? అసలా విషయం మీకెందుకు ?" కోపంతో అడిగింది సుందరి.

"క్షమించండి ! మీరు కోప్పడి లాభంలేదు. మీమేలు కోరి మీకు మంచి చేయడానికే వచ్చాను. పిలవని పేరంటంలా వచ్చానని మీరు అనుకుంటున్నారు గదూ ! మీరేమనుకొన్నా ఫరవాలేదు. మీతోపాటు మరో జీవి నాశనంకావడం నా కిష్టం లేదు. మీరు నిజంగా సహృదయులైతే మీ జాతి మీద గౌరవాభిమానాలున్నట్లయితే యీస్వార్థం విడనాడి ఒక జీవిని బాగుపడ చేయ దల్చుకుంటే నామాటల్ని వినండి. ముల్లు పోయి అరిటాకుమీద పడ్డా అరిటాకు పచ్చి ముల్లు మీద పడ్డా అరిటాకుకే మోసం." అని ఆవేశంతో పలికాడు మూర్తి.

సుందరి నిశ్చేష్టితయయింది. "ఇంతకూ మీరసలు సంగతి చెప్పలేదు. అనవసరంగా ఆగ్రహపడడం మంచిది కాదేమో !" అంది నవ్వుతూ సుందరి. మూర్తి సిగ్గుపడ్డాడు.

"అకృత్యమైన కార్యాలు ఆవేశాన్ని కలిగిస్తాయి అనే విషయం మీకు తెలిసే వుంటుంది. ఏమీలేదు. మీరు ఏమీ అనుకోకుండా వుంటే మిమ్మల్ని ఓ మాట అడుగుతాను. మీకు నాగేష్ మీద ఏలాంటి అభిప్రాయం వుందో తెలుసుకోవచ్చా ?"

"అలా అడగడంలో మీ అభిప్రాయం ?" అని సూటిగా ప్రశ్నించింది సుందరి.

"నాగేష్ విషయం మీకు ఏమీ తెలియదని మీరు పలికిన పలుకులే తెలుపుతూన్నవి. నాగేష్‌కు గీతారత్నం అనే స్నేహితురాలువుందని మీకు తెలుసా?" అంటు సుందరి కండ్లలోకి చూచాడు మూర్తి.

"సుందరి ఆశ్చర్య పోయింది. ఆ అమ్మాయి ఎస్. ఎస్. ఎల్. సి. కదూ చదువుతూంది."

"అవును. మీకు తెలుసా ఆమెను?"

"తెలుసుకానీ అంత పరిచయం లేదు."

"ఉండవచ్చు. ఆ అమ్మాయి నాగేష్‌ను ఎన్నడో ప్రేమించింది. నాగేష్‌కూడా ఆమె అందాన్ని చవిచూచాడు. ఇప్పుడు నీవు దొరికావు. ఆ అమ్మాయి బ్రతుకు నాశనమయింది."

"అంటే"

"అర్థమవడంలేదా ? నాగేష్ నీవలలోపడి ఆమెను వదిలేశాడు. ఆమె బావురుమంటోంది."

సుందరి కండ్లలో నీళ్లు తిరిగాయి. ఆమెమీద దురభిప్రాయాన్ని కలిగివున్న మూర్తి ఆమె కంటి నీరును చూచి ఆశ్చర్య పోయాడు.

"మిమ్మల్ని బాధపెట్టిందానికి క్షమించండి."
సుందరికి నాగేష్ మీద చాలా కోపంవచ్చింది. రేపు తన బ్రతుకూ యింతేనేమో ! అందంగా వున్న స్త్రీ మధువును గ్రోలడమేనా యతని పని ? ఛీ ! ఈ మగజాతినే నమ్మకూడదు. ప్రశాంత పూరితమైన ఆ ముఖంలో ఎన్ని విషచ్ఛాయలలుము కొని వున్నాయి ! "మూర్తిగారూ ! నాగేష్ సౌందర్యాతిశయములో నిద్రబోతూ మునిగి

తేలుతూవున్న నన్ను మేలుకొలిపారు. ఈ నాడు ఆమెగతి ఎలా అయిందో రేపు నాగతి అంతేకా బోతుంది. నాగేష్‌కు యీ నాడే బుద్ధిచెప్పి తిలోదకాలిస్తాను."

మూర్తికి పరమ సంతోషమయింది. ఆమె తన కిచ్చిన సహకారానికి యెంతో పొంగి పోయాడు. ఆమె నభినందించి, గీత యింటి త్రోవపట్టాడు, మూర్తి.

## 8

గీత నాగేష్ చేత తిరస్కరింప బడినప్పటినుండి యేదో తెలియని మనోవ్యాధితో సగమయి పోయింది. తను బతికి పోతున్నదనే కానీ, అందులో యేమంత వుత్సాహం గోచరించేదికాదు.

బడిలో అప్పుడప్పుడు నాగేష్‌ను చూచేది గీత. అతన్ని చూచినప్పుడల్లా తనకళ్లల్లో నీళ్లు తిరిగేవి. అతని తట్టు జాలిగా చూచేది. కానీ నాగేష్ గీత తట్టు చూచేవాడు కాదు.

లక్ష్మి మూర్తిని యెన్నిమార్లో కలుసుకుంది. అతనితో యేవో మాటలు చెప్పేది.

లక్ష్మి మూర్తిని చూచినప్పుడల్లా యేదో తెలియని ఆనందాన్ని అనుభవించేది. అతనితో మాట్లాడా లంటే యెంతో వుత్సాహం చూపేది.

మూర్తి గూడా లక్ష్మిని చూచినపుడు యెంతో అభిమానం చూపేవాడు. లక్ష్మితో యిన్నాళ్లూ కలిగిన ప్రేమానురాగాలు మూర్తి స్నేహంతో వుద్భవించాయి.

లక్ష్మి మూర్తి కలుసుకుని యేవేవో మాట్లాడు కోటవటం యిద్దరూ కలసిమెలసి వుండటం పలు మార్లు చూచింది గీత.

ఆ దృశ్యాలు చూచేటప్పుడు గీత హృదయం తపించి పోయేది. వారిద్దరూ అన్యోన్యంగా వుండ డంచూచి సహించలేక పోయింది.

మూర్తి యెవరు? నాగేష్ ముఖ్యస్నేహితుడు. నాగేష్‌తన్ను మోసంతో అన్యాయంచేశాడు. తన జీవితం సర్వ విధాలా భ్రష్టు జెందింది. సంఘంలో తనకిప్పుడు స్థానంలేదు. తను అందరి నోళ్లవాపడి నానింది.

ఆ నాడు గీతకు కడుపులో నొప్పి జాస్తయి స్కూలుకు వెళ్లకుండా యింట్లోనే వుండిపోయింది.

తన ఆలోచనలన్నీ ఆ నాడు లక్ష్మిమీద నిలిచి పోయాయి. లక్ష్మిని పిలచింది. లక్ష్మి ప్రక్కన వచ్చి నిలబడింది.

"ఏం లక్ష్మి! నీవు చాల రోజులనుండి నాదగ్గ రకు రావడంలేదే?" లక్ష్మికి ఈ ప్రశ్నలోని అర్థం ఏమిటో తెలియలేదు.

(సశేషము)

# గాలిపటము

శ్రీమతి గంటి కృష్ణవేణమ్మ



గాలి వీచిన యప్పుడే; కదలఁగలవు
లేని యప్పుడు నీగతి గానుపించు
ఎపుడో; ఏనిముసానదో; ఎఱుగరాదు
చికులు కొందువు కంపల చెట్ల నడుమ

అంబరంబున దిఱుగు పీతాంబరునకు
వాహనంబైన కులములో వారిగాంచి
సరియటంచును దిరిగెదు చలము పట్టి
నిజ బలంబున్నదే? సుంత నీదు చెంత!

గాలిని నమ్మి చరించెదు
కాలమునకు ననుసరించి కదలును నదియుఁ
కాలగతిఁ దెలియ వశమా
బేలవు నీ మీఁదెఱుంగ వేలా మేలా

త్రాడు తెగిపోయె నను బట్టు వాఁడులేడు
తోక బారెడు గలదంచు త్రుళ్ళిపడుచు
ఆకసంబున విహరింతు నంచు నీవు
గర్వమందకు మదిలోన గాలిపటమ

ఉన్నత పథమున నెగురుదు
నన్న మహా గర్వమో! యహంకారంబో
ఎన్నవు మఱు నిముసపు గతి
లెన్నునహో! గాలిపటమ తెగ నీల్గకుమా!

ఎదుర వేసిరొక్క రెక్కించి రొక్క
రుదారగుణము తోడదారమునను
తెగియె దారమనుచు దిరిగెదు స్వేచ్ఛ
స్వంత బలము నీకు ఎంత గలదు

తగులు కొనిన యప్పుడు కడు
ఇగిలింతువు; నిన్నుగాంచి ఏకసక్కెముగా
నగుదురు చేతులు చరచుచు
దిగిరమ్మా గాలిపటమ తీవ్రముతోడఁ

అత్యుశ్చ పతన హేతువు
నిత్యముగా బోదు పథము నెరినమ్మితుదిఁ
నత్యంత వెతల బొందెదు
గత్యంతర మింత లేక గాలిపటంబా!

చిందర వందరలై నీ
యందము చందమును బోవ యావల మదిలో
కుందెదు త్రిశంకు విధిమున
ఇందున నందునను లేక ఇలలో నీవుఁ



# జలపాతం

శ్రీ పులిపాక జగన్నాథరావు

---o---

చంప ఆ సర్వసాధారణపు జలపాతాన్ని అంత ప్రియంగా, హృదయంలో ఆరాధ్య దేవతగా పూజించటంలో ఆంతర్యమేమిటి? వర్షకాలంలో వాగూ వరదా వచ్చినప్పుడు అది ఉద్ధృతంగా, హోరుతో గుండెలనవియ చేయగలిగినా, ఇతర సమయాలలో వర్షపుజల్లు విలువకలిగినది మాత్రమే! కాని చంప దానిని 'నయాగరా అంత గొప్పది! అందమైనది! ఆనందానుభూతిని ప్రసాదించగలిగినది' అని వర్ణించటానికి కారణమేమిటి? ఆరహస్యమేమిటో ఆమె తెలియచెప్పలేదు. దానిని ఆమె గుప్తధనంగా పరిగణించింది. అయితే ఆమె భర్త నవ్వుతూ ఆకారణమేమిటో నాకు మొన్ననే ఇలా చెప్పాడు:—

"దేశస్వాతంత్ర్య సమరపు రోజులలో పరప్రభుత్వం నన్ను పట్టి ఇచ్చిన వారికి పదివేలరూపాయల బహుమానమని ప్రకటించింది.

చంప పరప్రభుత్వపు రహస్య గూఢా చారిణిగా ఉండేది. ఆమె నా ఆచూకీ, నివాసస్థలం మారుపేరుతో కడుజాగరూకతతో ఉన్నా పసిబట్టింది.

నేను చంప అంద చందాలను, ధైర్యాన్ని విని ఆమెను పెళ్లాడటం పెద్ద భాగ్యంగా పరిగణించకపోలేదు.

అయితేనేం! చంపా, నేనూ వేరు పతాకాల క్రింద వేరు ఆశయాలతో పోరాడుతున్నాము.

చంప తన ప్రభుత్వాధికారులకు ఒప్పచెప్పటానికి నన్ను బందీగా తీసుకువెళ్లుతూన్నది. దారిలో జలపాతం ఉన్నది. అది వర్షా కాలం. సామాన్యంగా జలపాతం క్రిందగా పోతే శరీరం తడవటం తప్ప ప్రమాదమేమి ఉండదు.

కాని వాగు, వరదా ఏకమై జలం వేగంగా పడటం మొదలుపెట్టింది.

దాని క్రిందగా ఆమెపిస్తోలు గుండును నా వెన్నున బారుచేసి తీసుకువెళ్లుతున్నప్పుడు నాకు సంభవించగల దుర్గతి ఏమీగుర్తుకురాలేదు. ఆమె స్పర్శకే నేనానందించాను. 'చంపచేత పట్టుపడటం ఎంత అదృష్టం! అనుకున్నాను' నేను వెనక్కు ఒక్కసారి ఆమె రూపంవేపు చూచి.

'పదివేల రూపాయల బహుమానం నీకు నీ ప్రభుత్వం నన్ను పట్టి ఇచ్చి నందులకు ఇస్తుంది కాబోలు!' అని నేనామెను దెప్పిపొడిచాను.

'అవును! పదివేలు! తరువాత నాకిక ఈ ఉద్యోగపు బాదరబందీ ఉండదు. సుఖంగా జీవనయాత్ర సాగించ వచ్చు' అన్నది చంప ఆనందంగా.

అప్పుడామె ముఖం చంద్ర బింబంవలె వికసించి ఉన్నది.

"తరువాత నీవు పెళ్ళిచేసుకుంటావు కాబోలు! నీ భర్త ఎవరో అదృష్టవంతుడు. ఇంత రూపసంపదను,పదివేలను కట్నంగా పొందుతాడు."అన్నాను నేను చేతులూపుతూ. ఆమె నా చేతులను బంధించలేదు.

"ముందునీకు కొన్నిక్షణాలలో జరుగగల పెళ్లిని గురించి ఆలోచించుకో!" అని చంప ఆగ్రహంగా నా ఎత్తిపొడుపుకు జవాబిచ్చిందో లేదో, కాలుజారి జలప్రవాహంలో పడిపోయింది. ప్రవాహం వేగంగా సాగిపోతున్నది. వర్షంకురుస్తున్నది. చీకటి పడుతున్నది. నేను వెంటనే ప్రవాహంలో దూకాను. చంపను రక్షించేపని యమయాతన కలిగించింది.

అచేతనంగా ఉన్న ఆమె శరీరాన్ని నా భుజం మీద వేసుకుని ఒక చేత్తో ఈదుకుంటూ ఒడ్డుకు చేర గలగటం — సర్వేశ్వరుని కృపవలననే! చంప ఎంతో సేపటికి కళ్లు తెరచింది. జలపాతం ప్రక్క కొద్ది దూరం నిర్మానుష్యంగా ఉన్నది. 'అదుగో దూరంగా చంపా - మీ ప్రభుత్వపు ఆఫీసు దీపం. త్వరగా నన్నక్కడికి తీసుకుపో, అలసిపోయాను.' అన్నాను నేను.

చంప కళ్లు చెమ్మగిల్లినై. 'నీ దేశాభిమానం ఎంత గొప్పదో, నీ త్యాగ నిరతీ అంతే గొప్పది. శత్రువునైన నన్ను జలపాతంనుంచి కాపాడావు. పదివేల రూపాయలకు గడ్డి తిందామనుకున్నాను.

మా గూఢచారి దళానికి నీ దేశభక్తి తెలియనిదికాదు. దానివిలువ అమూల్యమని మాకు తెలుసు. వెనక నిన్ను వీరుడుగానే ఎరుగుదును. నిన్ను బందీగా తీసుకువస్తున్నప్పుడు నీరూపానికి నేను భ్రమసిపోక పోలేదు.

ఇప్పుడు ఈ సద్గుణానికి రిచ్చ బడ్డాను.

"నీ భర్త ఎవరో అదృష్టవంతుడు.' అన్నారు మీరు. అతడెవరో కాదు - "మీరే! ఇంత రూప సంపదను కట్నంగా పొందుతున్నారు" అన్నది చంప.

"అదీ, ఆ జలపాతపు రహస్యం'" అన్నాడామె భర్త ఈ కథ నాకు చెబుతూ బిగ్గరగా నవ్వుతూ చంపవేపు చూచి.

చంప తలవంచుకున్నది సిగ్గుతో.

# మర్యాదలు

శ్రీమతి సువేణి మథుకుమల్

మనిషిఅయి పుట్టాక మర్యాద అనేది తెలిసికొని ఉండాలి. అందులో స్త్రీలకు చెప్పనే అక్కర్లేదు. అసలు స్త్రీ అనే శబ్దము వినగానే మర్యాదలకు పుట్టిల్లు అనే భావన కలగాలి. ఎందుకంటే స్త్రీని గృహలక్ష్మి అన్నారు. గృహము యొక్క మంచి చెడ్డలు, అందచందములు ఆ ఇల్లాలిమీదనే ఆధారపడి ఉంటాయి. ఒక ఇల్లు కళకళ్లాడుతున్నదంటే ఆ ఇంటి ఇల్లాలు కళకళ్లాడుతూంటుందని వేరే చెప్పనక్కర్లేదు. ఇంకా చెప్పాలంటే మగవాడికి సంఘంలో స్థానం కల్పించేది స్త్రీ అనాలి. కనుక స్త్రీ ఎంత తెలివి అయినదిగా, ఎంత మంచిదిగా ఉండాలో చెప్పుట మనవసరము. ఇంటికొచ్చిన వారిని సత్కరించటము చాలవరకు స్త్రీ మీదనే ఆధారపడి ఉంటుందనాలి.

ఇంటికొచ్చిన అతిధుల మనస్సు నొచ్చుకోకుండా తగిన విధంగా వారిని సత్కరించట మెంత అవసరమో అంత గొప్ప విషయముకూడ. ''ఎప్పటి కెయ్యది ప్రస్తుత మప్పటికామాటలాడి'' అన్నట్లు ఎప్పుడెవ్వరితో ఎలా నడుచుకోవాలో తెలిసికోవటం ముఖ్యమైనది. 'ఎవ్వరేమనుకొంటె నాకేం? నా స్వభావమిది. నాకు మారటం చేతకాదు' అనుకోవటం తెలివి తక్కువను ప్రదర్శించటమే కాకుండా వాళ్ల అహంభావాన్నికూడ బయలుపరుస్తుంది. కొంతమందికిది చాల తేలికవిషయంలాగ కనబడుతుంది. 'ఆ మాత్రం మర్యాద చేయటంరాదా?' అంటారు. నిజానికి చాల మందికి చేతకాదనాలి చేతకాక పోవటమే కాకుండా అశ్రద్ధకూడ. కారణం దాని ఔన్నత్యము తెలిసికోలేకపోవటమే.

స్త్రీకి ఔన్నత్యము కలిగించేవాటిలో ఈ మర్యాద ఒకటనాలి - కాదు ముఖ్యమైనది. ఎంత చదువున్నా, ఎంత డబ్బున్నా ఈ మర్యాదనేది లేకపోతే ఆ మనిషికి నిజమైన విలువ ఉండదు. కాని ఈ కాలం వాళ్లకి మర్యాదలు తెలియవనాలి. వాటి ఔన్నత్యం అంతకంటె తెలియదు. తెలిసికోవాలని ఉండదో, తెలుసుకోవటమనేది చిన్నతనమనేభావనో! ఏదైతేనేమి చదువుకొని, ఉచ్ఛస్థితిలో ఉన్నవారికి మర్యాదలు ఎక్కువగా తెలుస్తాయనుకోవటం చివరికి భ్రమక్రింద మారుతోంది.

ముఖ్యంగా పెద్ద పెద్ద ఆఫీసర్ల భార్యలను చూస్తూంటే చాల ఆశ్చర్యంగా ఉంటుంది. మరి వాళ్ల ఉద్దేశమేమిటో తెలియదుగాని వాళ్లు తమకన్న కాస్త

తక్కువ అయినవాళ్లు అయితే చాలు తమ బంధువులను, స్నేహితులనుకూడ చాల అమర్యాదగా చూస్తారు. బహుశ ఎదుటివారికి మర్యాద ఇవ్వటమంటే తాము లోకువ అవటమనుకొంటారేమో! ఇదంతా ఏదో శాస్త్ర చదివినవాళ్లకి మరీ ఎక్కువగా ఉంటున్నది. నాలుగు ఇంగ్లీషు ముక్కలు నేర్చుకోగానే తమంతవాళ్లు లేరని, ఎదుటివాళ్లందరు ఎందుకు పనికి రారనే భావన కల్గుతోంది. అందువలననే వాళ్లు ఎదుటివాళ్లను ఎలా గౌరవించాలో తెలియక తికమకలుపడి దానికి దూరంగా ఉంటున్నారు.

పూర్వం ఎంత విద్యావంతులైనా, ఎంత ధనవంతులైనా ఎదుటివారి స్థితిగతులు విచారించగలశక్తి, వారి ఔన్నత్యము గుర్తింపగలశక్తి కలిగివుండేవారు. శ్రీకృష్ణదేవరాయలంతటివాడు పెద్దన్నగారికి స్వయంగా గండపెండెరముతొడిగి గౌరవించాడంటే ఆయనకానాడీలోకువ అవుతామనే భయము లేదనిపిస్తుంది. బహుశ! ఆతనిలోని ఔన్నత్యమే ఆతనికాభావము కలగనీయలేదేమో! ఇంతకీ నేచెప్పేది ఎంత గొప్పవారైనా ఎదుటివారిని గుర్తించి తగినట్లు సత్కరించటములోనే నిజమైన గొప్పతనము కనిపిస్తుందని.

పూర్వము ఈ మర్యాదల కెక్కువ ప్రాముఖ్యత ఇచ్చినట్లు మన పురాణ గాధలవలన తెలుస్తోంది. మరి వాళ్లందరు ఈ మర్యాదల ప్రాశస్త్యము తెలిసినవారేనా? ఏమో అందరు దీన్ని గురించి ఆలోచించి దాని విలువను తెలుసుకొని ఉంటారా! ఏమైతేనేమి ఆలోచించగల్గినవాళ్లు, లేనివాళ్లంటారనే మనవాళ్లు కొన్ని forms లాగ చేసిపారేశారు. అందువలన వాటివిలువ తెలిసినా తెలియక పోయినా గుడ్డిగా అనుసరించేవారు. ఆ పద్ధతే చక్కగాఉంది. కాని మన దురదృష్టవశమో ఏమో పాశ్చాత్యులు రావటం వారి ఆచారములు మనకి అంటించటము, అవి సరిగా మనకి అతుక్కోక పోవటమేకాకుండా, మన అలవాట్లన్ని అణిగిపోవటం జరగటంతో మనమీఅధ్వాన్నపుస్థితికొచ్చాము. సరే అయిపోయిన దానికి విచారించి ఏంచేస్తాము! ఇప్పుడైనా శాస్త్ర కనువిప్పామంటే మన సంస్కృతి గ్రహించవచ్చు. మన పూర్వులు కట్టినగోడలు కట్టినట్లుగా లేవిప్పుడు. అందుకు మనమెవ్వరిని ఏమి అనలేము. కాలచక్రం గిర్రున తిరుగుతున్నప్పుడు ఎన్నో మార్పులు సహజంగా జరుగుతూంటాయి. తురుష్కులరాకతో మన పూర్వ సాంప్రదాయము అనేక మార్పులు పొందింది. సరే అక్కడినుండి ఐరోపీయులరాకతో పూర్తిగా మారిపోయే స్థితికొచ్చింది. కాదని ఆపటం ఎవ్వరి శక్యముకాదు. కాని ఆ మార్పులను మన

సాంప్రదాయాలలో సరిచేసుకొని మన సాంప్రదాయమునకు మెరుగులు దిద్దుకోవటము ఉత్తమము.

ఇంతకీ ఇదంతా మర్యాదలు మట్టిపాలు కాకుండా చూడాలని. పూర్వపువాటిని పట్టుకొని వ్రేలాడనూలేము, పాశ్చాత్యులవి పూర్తిగా అనుకరించనూలేము కనుక ఏదీలేకుండా ఉభయభ్రష్టుత్వము అవ్వడానికన్నా మన ఆచారాలు, వాళ్ల ఆచారాలు సమన్వయముచేసుకొని ప్రవర్తించటము మంచిది. వీలుంటే ఈ సారి ఈ మర్యాదల గురించి బాగా విశదీకరించుకొందాము.

# వ్యాధి — చికిత్స

శ్రీ జి. వి. ఆర్. మూర్తి



పిల్లల వ్యాధుల గురించి తెలియజేయుటకు ముందు పిల్లల పెంపకమును గూర్చి కొద్దిగా చెప్పవలసిన ఆవశ్యకత కలదు.

**ఆహారము :** తల్లి పాలకు మించిన ఆహారము పిల్లలకు వేరే లేదు. తల్లిపాలు శరీరమునకు తగిన పోషణ నివ్వడమే కాక వ్యాధి నిరోధకముగా గూడ బిడ్డను కాపాడగలవు. ప్రతిదేశములోను పోతపాలు త్రాగు పిల్లలు ఎక్కువగా చనిపోవుచున్నారని తెలియుచున్నది. ప్రతితల్లియు తన బిడ్డకు ఆరు మాసములైన పాలు యివ్వవలెను. లేకపోయిన బిడ్డ ఆరోగ్యము చెడుటకు ఎక్కువ అవకాశమున్నది.

బిడ్డకు చనుబాలు యిచ్చినను, పోతపాలు పోసినను నియమిత కాలములందు ఆహారము యిచ్చుట ముఖ్యము. ఈ అలవాటు మొదటినుండి చేయవలసి యున్నది. నియమిత కాలములందు బిడ్డను లేపి పాలు యిచ్చుచుండిన బిడ్డకూడ నియమిత కాలములందే పాలకొరకు ఏడ్చును. ఈ అలవాటు లేకపోయిన బిడ్డ యొక్క జీర్ణశక్తి పాడగును.

ఏ బిడ్డకో గాని తల్లిపాలు పడకపోవడము ఉండదు. తల్లి చనిపోవుటవల్లనో, తల్లి ఆరోగ్యము చెడి పాలు యివ్వకూడదని వైద్యుడు సలహా యిచ్చుట వల్లనో బిడ్డకు పోతపాలు పోయవలసిన అవసరమేర్పడును. అట్టి సమయములందు మంచి ఆవు పాలలో ఎత్తునకు ఎత్తు నీళ్లు కలిపి కొద్దిగా చక్కెర వేసి యివ్వవలెను. పంచదారకు బదులు పాల చెక్కెర వేయుట మంచిది. పురిటి పిల్లలు ఒక ఔన్సుకన్న ఎక్కువ పాలు ఒకేసారి త్రాగలేరు. నెల పిల్లలు 1½ ఔన్సు లేక 2 ఔన్సులవరకు త్రాగుదురు. నాల్గవ నెలవచ్చునంతవరకు ప్రతి 2½ గంటల కొకసారి పాలు పట్టవలెను. తరువాత ప్రతి 3 లేక 3½ గంటల కొకసారి పట్టవలెను. పోతపాలయినయెడల బిడ్డ పెరుగుచున్న కొలది పాలలో నీళ్లను తగ్గించుచు రావలెను. బిడ్డకు మూడవ మాసము వెళ్లినప్పటినుండి రాత్రి పది దాటిన తరువాత పాలు యివ్వకూడదు.

బిడ్డకు ఒక నెల వెళ్లిన తర్వాత దినమునకు ఒక చెమ్చాడు చొప్పున బత్తాయి పండ్లరసము యిచ్చుట మంచిది. ఏడవమాసమునుండి కాచిన జావ (బార్లీ మొదలయినవి), ఉడికించిన కూరలు పెట్టవచ్చును. తరువాత పదవ మాసమునుండి అప్పుడప్పుడు కోడిగ్రుడ్డునుకూడ యివ్వవచ్చును.

ఒక ఏడాది గడచినప్పటినుండి పిల్లల ఆహార విషయమై మరింత జాగ్రత్త అవసరమగును. ఆరోగ్యవంతముగా పెరుగుచూ, ఉల్లాసముగా ఆడుకొనుటకు తగిన ఆహారమును యివ్వవలసి యున్నది. పిల్లల శరీరము చక్కగా పెరిగి, దృఢముగా నుండుటకు గాను, వివిధ లవణములు విటమిన్లు, కాల్షియం, ఫాస్ఫరస్ మొదలయినవి ఆహారమునందుండవలెను. పెద్దలకు కూడ యివి అవసరమే గాని పిల్లలకు ఎక్కువగా కావలసి యున్నది. కనుక పెద్దలు తిను ఆహారము పిల్లలకు సరిపడక చక్కగ ఎదుగరు.

ఆకు కూరలయందు, కోడిగ్రుడ్లయందు, పాలయందు లవణములు, విటమిన్లు సమృద్ధిగనుండును గనుక వాటిని పిల్లలకు ముఖ్యముగా యివ్వవలెను. పిల్లల పెరుగుదలకు పుట్టినప్పటినుండి పాలు ముఖ్యమైన ఆహారము గనుక వాటిని ప్రతిదినము యిచ్చి తీరవలెను. ఆడుకొను పిల్లలకు తీపి పదార్థములు యిచ్చిన యెడల ఉత్సాహవంతులుగా నుందురు.

పిల్లలకు ముఖ్యముగా చలిగాలి తగులకుండ వెచ్చగా నుండునట్లు బట్టలు తొడగవలెను. కాని అంగములు కదల్చుటకు వీలుగానుండగను, బరువుగను ఉండకూడదు. దినము కొకసారియైన నీళ్లుపోసి దేహమును శుభ్రము చేయవలెను. వాతావరణము నందును, ఆహారమునందు ఒక్కమారుగా మార్పు కలిగిన బిడ్డ ఆరోగ్యము చెడును గాన కడు జాగరూకతతో నుండవలెను.

ఈ క్రింద వివరించిన చికిత్సా విధానము సాధారణ వ్యాధులకేగాని అన్నిటికి కాదు. వైద్యసహాయము లభించుటకు కొంత వ్యవధి అవసరమగును. వైద్యుడు వచ్చునంతలోపల గృహవైద్యముగా చేసుకొనుటకు మాత్రమే యీ క్రింది వివరణము సహాయపడును. తరువాత తగిన వైద్యసలహా పొందవలెను.

పుట్టిన వెంటనే పాలు త్రాగలేక పోవుట: తల్లి పాలను చిన్న గిన్నెలోనికి పితికి ఒక్కొక్క చుక్కగా దూదితో బిడ్డ నోటిలో పోయవలెను. అప్పటికిని బిడ్డ నీరసమువలన కుడిచి త్రాగలేక పోయిన యెడల — చైనా — 6. ఇచ్చుట మంచిది.

పుట్టిన వెంటనే విరోచనము కాక పోయిన యెడల: పొట్టను మృదువుగా నిమురవలెను. నక్సువోమిక - 6. బ్రైయోనియా 6. సల్ఫరు - 30. బెల్ డోనా — 6, ఏదైన ఒకటి యిచ్చి చూడవలెను, శస్త్ర చికిత్స అవసరమైన వెంటనే శస్త్ర వైద్యునికి చూపించవలెను.

చర్మవ్యాధులు: ఇవి అనేక విధములుగా నుండును. దేహమును శుభ్రముగా ఉంచి, లక్షణములననుసరించి చికిత్సచేయవలసి ఉన్నది. ముఖ్యముగా గజ్జి, కురుపులు మొదలగు చర్మ రోగములు కలిగిన సల్ఫర్ — 30 బాగా పనిచేయును. వేడి వలనను, బట్టలు బాగా కప్పి ఉంచినందువలనను పేత పొక్కులవలె లేచిన చామొమెల్ల - 6. సల్ఫరు 30 బాగా పనిచేయును. చలివలన చర్మవ్యాధి వచ్చిన - డల్కామెరా — 6 యిచ్చిన నయమగును. లావుగా నుండు బిడ్డలకు వచ్చిన కాల్కేరియా కార్బ యివ్వవచ్చును. తరువాత వీలయినంత త్వరలో వైద్య సలహా తీసికొనుట ఉచితము.

ఎక్కిళ్లు: జీర్ణకోశము సరిగా పనిచేయనపుడు ఎక్కిళ్లు వచ్చును. ఉదరమును, ఛాతీని వేరు చేయు డయాఫ్రమ్ నరములకు సంబంధించిగాని, చల్లటి పానీయములు వలనగాని వచ్చును. కనుక బిడ్డకు వెచ్చని దుస్తులను తొడిగి ఉంచవలెను. మేగ్ ఫాస్ -6 ప్రతి అరగంటకు యిచ్చిన యెడల తగ్గిపోవును. నక్సు వోమికా — 30 కూడ యిచ్చి చూడవచ్చును.

నిద్రలేమి: పెద్దవారివలె చిన్న పిల్లలకు ఆలోచనలవలన నిద్రపట్టక పోవుట ఉండదు. ఏదేని యితర రోగము వలననే నిదుర పోవక ఏడ్చుట జరుగును. కనుక మూలకారణమైన ఆవ్యాధిని తెలిసికొని, దానికి తగిన చికిత్స చేయుట అవసరము. ఏదేని నొప్పి వలన ఏడ్చుచుండిన — మేగ్ ఫాస్ — 6 x; ఎత్తుకొనమని ఏడ్చుచుండిన — చామొమెల్ల - 6 విరోచన బద్ధముండిన — నక్సువోమిక — 6. ఉల్లాసముగా ఉండి మధ్య మధ్య ఏడ్చుచుండిన కాఫీ - 6. నులి పురుగులు, ఏలిక పాములతో బాధపడు చుండిన సీనా - 30 తలవేడిగానుండి ఉలిక్కిపడి లేచు చుండిన: బెల్ — 30

పాలు కక్కుట లేక వాంతులు: పాలు కక్కుట అన్నది ఒక ప్రత్యేకమైన వ్యాధికాదు. ఇతర వ్యాధులందు యిది యొక లక్షణము. ముఖ్యముగ జీర్ణశక్తి సరిగా లేదని తెల్పులక్షణము. కనుక బిడ్డ పాలు కక్కిన తరువాత మరల, మరల పాలనిచ్చుట పొరపాటు. కనుక జీర్ణకోశ లక్షణములను బట్టి చికిత్సచేయవలెను. బిడ్డ పాలుత్రాగక పోయిన బలవంతపెట్టకూడదు. వాంతి పులుపు వాసనతోనుండి, విరోచన బద్ధకముండిన నక్సు — 6. త్రాగిన వెంటనే గాని కొలది సేపటిలోగాని బిళ్ల బిళ్లలుగా కక్కుకొనిన - ఎథూజా 6. నాలుక పై తెల్లనిపూత ఉండి అజీర్ణమువలన వాంతి చేసుకొనిన - కాలీమూర్

6 x పల్సాటిల్లా — 6. వికారముండి, వాంతి జిగటగా కఫముతో గూడి ఉండిన — ఇపెకాక్ 6.

మలబద్ధము: ఇదికూడ ప్రత్యేకమైన వ్యాధి కాదు. సరియైన ఆహారము బిడ్డకు యివ్వకపోవుట వలన యిది కలుగును. మామూలుగా విరోచనము కాక, గట్టిగా, ఉండ ఉండలుగా విరోచనమయిన మలబద్ధముందురు. తల్లిపాలు త్రాగు పిల్లలకు విరోచన బద్ధముండదు. పోతపాలు పిల్లలకే యిది కలుగు చుండును. వైద్యుని సలహా తీసుకుని ఆహారమునందు తగిన మార్పు చేసిన విరోచనము సరిగా అగును. ప్రతి దినము ఆముదము పట్టుట మన దేశమందు ఆచారము. కాని బిడ్డల ఆరోగ్యమునకు యిది భంగకరమని వైద్యనిపుణుల అభిప్రాయము. మలబద్ధము వలన కడుపు ఎత్తుగా నుండి బిగుసుకుని ఉండ వచ్చును. ఒక్కొక్కప్పుడు కడుపునొప్పికూడవచ్చును. నీరసము తలనొప్పి, త్రేన్పులు, మూత్ర విసర్జనమునందు నొప్పి మొదలగు యితర లక్షణములుగూడ ద్వంద్వము కలసి ఉండును.

పోతపాలవలనగాని, తల్లి అజీర్ణముచే బాధపడు చుండిన బిడ్డకు వాంతులుకూడ ఉండిన — బ్రైయోనియా - 30. బిడ్డలావుగా ఉండి, మలబద్ధముచే చిక్కిపోవుచుండిన - కాల్కేరియ కార్బ - 6. నాలిక తెల్లగా ఉండిన: కాలీమూర్ - 6x, ఏంటిమోనియంక్రూడం - 30. త్రేన్పులు, కడుపునొప్పితో బాధపడుతూ, కడుపులో గుడగుడలు ఉండి కొద్దిగా గట్టిగా మలవిసర్జనమయి బిడ్డ సన్నగా నుండిన — లైకో పోడియం 30. పైబాధలుండి మలమును ఎక్కువగా విసర్జించిన నక్సువోమిక 30. దీర్ఘవ్యాధి అయిన యెడల వైద్య సలహా అవసరము.

కడుపునొప్పి: సాధారణముగా పిల్లలకు ఆహార దోషమువలననే యీ బాధ వచ్చును. వారికి కడుపు నొప్పిని చెప్పుటకు మాటలు రావు గనుక వారు పడు బాధను బట్టి మనము గ్రహించవలెను. బిడ్డ చిరాకుగా నుండి, ఏడ్చుచుండును. కడుపులో గాలి పెరిగి, కడుపు ఉబ్బరించును. అందువలన కాళ్లను ముడుచు కొనుచు బిడ్డ ఏడ్చును.

బిడ్డ ఎత్తుకొనమని ఏడ్చిన, విరోచనము ఆకు పచ్చగానున్న ఎడల — చామొమెల్ల - 6. కడుపులో ఏలికపాములు, నులిపురుగులు ఉండిన - సీనా. 30. వాంతులుండిన—ఇపెకాక్ - 6. ప్రతిదినము ఒకే సమయమందు వచ్చుచుండిన — చైనా — 6. బిడ్డ కోరి తల్లి వద్ద పాలు త్రాగిన యివ్వవచ్చును. పోత పాల పిల్లలకు, నీరు ఎక్కువగా కలిపి పట్టవలెను.

విరేచనములు: మల విసర్జనము నీళ్లగా, ఎక్కువగా అగుచుండిన అతిసారమందురు. ఒక్కొక్కప్పుడు నురగగా, జిగురుగాకూడా అగుటకలదు. ఈ అతిసారము అజీర్ణ దోషమువలనగాని, సూక్ష్మక్రిముల వలనగాని కలుగుచుండును. తరచుగ ఎండాకాలమునందు యీ వ్యాధి తరచుగ నుండును. బిడ్డల కిచ్చు ఆహార పానీయములను మూతలేకుండ యీగలకు అందుబాటులో నుంచుటవలనను, నీళ్లను కాచకుండ పాలలోకలపి పట్టుటవలనను కలుగుచుండును. ఒక్కొక్కప్పుడు బిడ్డ జీర్ణ శక్తికిమించిన బరువైన ఆహారమును యిచ్చుట వలనకూడ యీ వ్యాధి కలుగుచుండును. బిడ్డకు పళ్లు వచ్చునప్పుడుకూడ అతిసారము కలుగును.

జలుబు, జ్వరముతో కూడ ఉండిన: ఎకొనైట్ — 6. ఆహారదోషమువలన కలిగి కడుపు ఉబ్బరముగా నుండి, ముఖము పాలిపోయిన - పల్సాటిల్లా 6. భరించలేనంత కడుపు నొప్పి ఉండిన- మేగ్ ఫాస్ 6 x, కోలోసింత్ - 6. పండ్లు వచ్చునప్పుడు బిడ్డ తిక్కగా ఉండిన — చామొమెల్ల — 6., పులిసిన వాసనతో పెద్ద విరోచనములు అగుచు కడుపు నొప్పి ఉండిన రూఅం — 30. వీటివల్ల తగ్గక పోయిన వెంటనే వైద్యసహాయము తీసుకొనవలయును.

జలుబు: జలుబు వచ్చిన వెంటనే తలిదండ్రులు గుర్తించగలరు. జలుబు అన్నదేమిటన్న విషయం యితమిద్ధమని వైద్య నిర్ధారణ చేయలేకున్నారు.

కారణములు మాత్రము చెప్పగలరు. ఏ సూక్ష్మ క్రిముల వలన కలుగుచున్నదో యింకను నిర్ధారణ చేయవలసి ఉన్నది. హోమియో వైద్యమునకు కారణములు గాని వ్యాధి పేరు ఏమైనదియు అంత ముఖ్యములు కావు. వ్యాధి లక్షణములే అత్యవసరములు. కనుక లక్షణములనుసరించి చికిత్స చేయవలెను. జలుబుకూడ అంటువ్యాధియే. ఒక బిడ్డకు యింటిలో జలుబు వచ్చిన యితర పిల్లలకుకూడ అంటుకొనును. కొందరి పిల్లలకు జలుబు తరచుగా వచ్చుచుండును. చలిగాలి తగులుటవలనను, గాలి మార్పువలనను నీళ్లలో నానుటవలనను తరచు యీ వ్యాధి పిల్లలకు పెద్దలకుకూడ సోకుచుండును. ఈ వ్యాధి కలుగకుండ ఎంత జాగ్రత్త తల్లిదండ్రులు తీసుకున్నను పిల్లలు బాధపడుటకద్దు. సాధారణముగ పది దినములలో జలుబు నివారణ అగుచుండును. జలుబునకు అనేక దశలున్నవి. ప్రారంభమునందు ముక్కు పొడిగానుండి, దురద మంట ఉండి తుమ్ములు వచ్చుచుండును. తరువాత పల్చని స్రావము ముక్కునుండి కారును. తర్వాత స్రావము చిక్కబడి, మెల్లిగ నయమగును. కాని ఒక్కొక్కప్పుడు గొంతుక, శ్వాశకోశముకూడా ముట్టడింపబడిన జలుబు తగ్గక యితర వ్యాధులు కూడ కలుగును.

ప్రారంభమునందు అనగా ముక్కు పొడిగానుండి తలనొప్పి కలిగి జలుబు చిహ్నములు కలిగిన — ఫెర్రంఫాస్ 6 కాలీమూర్ 6 తో మార్చుతూ యివ్వవలెను. వాసనశక్తిపోయి, పల్చగ స్రావముండిన నేట్రం మూర్ 6. చలిగాలి తగిలినందువలన, జ్వరముండిన - ఎకొనైట్ — 6. పొడిదగ్గు, పసుపుపచ్చని, చిక్కని స్రావముండిన — బ్రై 6. వికారము, నీరసము, గొంతుకలో గురగుర ఉండిన - యాంటిమోనియం టార్ట్ - 6. ముక్కు దిబ్బడ వేసిన, నక్స్ వోమికా 6 గాని, సాంబుకస్ - 6. నిలువక ఉండి, చిక్కని స్రావముండిన — పల్స — 6. ముక్కు, పెదిమలు వరసిన, మెర్క్యూరీ సోల్ - 6. ఆర్స. ఆల్బ — 6.

కోరింత దగ్గు: ఇది అంటువ్యాధి. సాధారణముగా రెండు సంవత్సరములలోపు పిల్లలకు వచ్చుచుండును. ఇది ఒకరినుండి ఒకరికి తుమ్ములవలన, దగ్గువలన, కలసి తిరుగు పిల్లలయందు కలుగును.

దీనికి నాలుగు దశలున్నవి. ఈ వ్యాధి సోకిన తరువాత వారము లేక రెండు వారములకు గాని వ్యాధి చిహ్నములు బయటపడవు. మొదట దశయందు మామూలు జలుబువలెనె తుమ్ములు, ముక్కు కారడము, గొంతుక బొంగురుపోవడము, కొలది జ్వరము ఉండును. రెండవ దశయందు కఠినమైన పొడిదగ్గు రాత్రులందు యెక్కువగనుండును. మూడవ దశయందు ఊపిరి తీయునపుడు, విడుచునపుడు రంపము కోతవలె శబ్దము వచ్చుచుండును. ముఖము ఎర్ర బారి, ఉబ్బిఉండును. నాలుక ముందునకు వచ్చి, కండ్ల వెంటనీళ్లు కారును. దగ్గు తెరతెరలుగా వచ్చి, బిడ్డ ఉక్కిరి బిక్కిరగుచుండును. వమనములుకూడ అగును. కొందరు బిడ్డలు ఊపిరి అందక కొయ్యబారి పోవుటకూడకలదు. ఈ వ్యాధి ఆరు వారములులేక రెండునెలలుకూడా ఉండును. తగిన చికిత్స చేయక పోయిన బిడ్డ చిక్కిపోయి, ప్రమాదమునకు గురికావచ్చును. కనుక వైద్యుని సహాయము చాలా అవసరము. కనుక గృహవైద్యము చేయుట పద్ధతి వ్రాయదలచలేదు. కాని వైద్యుడు వచ్చునంతలో పెర్టూసిన్ — 30 రోజునకు నాల్గుమోతాదులు యివ్వవచ్చును. బిడ్డ ఉక్కిరి బిక్కిరి అగుచుండిన వేడి నీళ్ళతో మేగ్ ఫాస్ 6 తరచుగా యిచ్చుచు, బిడ్డకు వెచ్చని దుస్తులను తొడిగి బాగా గాలివచ్చు గదియందు పరుండ పెట్టవలెను. ఆహారము ఎక్కువగా యివ్వక తరచు కొంచెము కొంచెముగా యివ్వవలెను. దగ్గువలన కడుపులోని కండరములు కదలకుండునట్లు ఏదైన పట్టా గట్టిగచుట్టపెట్టిన మంచిది. వీలయినంత త్వరలో వైద్యసహాయము పొందవలెను.

(సశేషము)

# కీటకములు-వీటి వింతశక్తులు

శ్రీ నిజామొహియుద్దీన్



మనము ప్రతిదినము అసంఖ్యాకములైన కీటకములను చూచుచున్నాము. కాని వాటి జీవిత చరిత్ర ఎట్టిదో, అవి తీసికొను ఆహారమేమిటో, మొదలగు విషయములు మనకు సరిగ తెలియవు. ప్రతియేట అసంఖ్యాకములైన కీటకములు సృష్టింపబడుచున్నవి. మానవుడు నాగరికుడైనప్పటి నుండి ఏడులక్షల ఏబదివేల కీటకములు కనిపెట్టబడినట్లు శాస్త్రజ్ఞులు అంచనవేసియున్నారు. ప్రతియేట నాలుగువేల విధముల కీటకములు కనిపెట్టబడుచున్నవి. భూమిపైనున్న కీటకజాతులను గణించినచో దాదాపు కొన్ని లక్షల జాతులున్నట్లు తెలియుచున్నది.

వీటి జీవిత చరిత్ర, కడువిచిత్రముగనుండును. కొన్ని కీటకాలు మానవుని కంటికి అగుపడవు. వీటిని సూక్ష్మ జీవులందురు. సూక్ష్మజీవులలో కొన్నిరకములైనవి మానవునికి హాని కలిగించును, కొన్ని మేలు కలిగించును. కలరా, క్షయ మొదలగునవి సూక్ష్మజీవులవలన గలుగును. రాజు ఈగ నాలుకపై, నివసించునట్టి సూక్ష్మజీవులుకూడా కలవు. సూది మొనపై కొన్ని వందల సూక్ష్మజీవులు కూర్చోగలవు. కొన్ని ఆహారములేకయే బ్రతుకుచున్నవి. కొన్నిటికి నోళ్ళుకాని, జీర్ణకోశములుకాని ఉండవు.

ప్రతిదినము మనము సీతాకోక చిలుకలను జూచుచున్నాము. కాని వీటిని గురించి ముఖ్యవిషయములు మనకు తెలియవు. సీతాకోక చిలుకలలో వివిధవర్ణములుగలవి ఉన్నవి. కాని ఆహారము అన్నియు ఒకేవిధముగా తీసికొనును. సీతాకోక చిలుక విశ్రాంతిలేక 3000, మైళ్ళవరకు ఎగురగలదు. ఎండ, వాన, గాలి, మంచును లెక్కచేయక ఎంతటి తూఫానులోనైనా ఎదురుగా ఎగురగలవు.

కొన్ని కీటకములకు ఎముకలుండవు. ఉసుళ్ళు అను పురుగులు ఈ జాతికి చెందినవే. ఇవి వర్షాకాలమందు గుంపులు, గుంపులుగా అభివృద్ధియగును. వేసవిలో జీవించియుండవు. కొన్ని కీటకములకు లోపల కండ, పైన ఎముక ఉండును. అనగా వీటి శరీర నిర్మాణము, మానవుల శరీరనిర్మానమునకు వ్యతిరేకముగా నుండును. వీటికి హృదయము వీపుపై భాగమున ఉండును. ఇవి పెరుగునపుడు పైనున్న ఎముక వంటి పదార్థము పగిలి పురుగుబయటికివచ్చును. అప్పుడు పురుగు

దూదివలె మెత్తగనుండును. తరువాత కొన్నిదినములకు ఎముకవంటి గట్టి పదార్థ మేర్పడును.

కీటకములకు మానవులకున్నట్లు రక్త నాళములుండవు. పైనుండి క్రిందివరకు ఒకే రక్తనాళముండును. దీనినుండి రక్తము శరీరభాగములన్నిటికి చేరుచున్నది. వీటికి ఊపిరితిత్తులుండవు. నోటితోగాని, నాసికారంధ్రాలతో గాని గాలిని పీల్చవు. ఇవి, ప్రక్కలనున్న పువ్వారాలతో గాలిని పీల్చును. శరీరములోనికి, గాలి రెండు తొండములవంటి నాళముల ద్వారా, పోవును. ఈ నాళములు వేలకొలది గాలి గదులతో నిండియుండును. గాలి తొండములద్వారా గదులలోనికి చేరును. విశ్రాంతిగనున్నప్పుడు గాలి వీటికి అవసరములేదు కష్టపడునపుడు ఏబదిరెట్లగాలి ఎక్కువగా కావలయును.

కీటకములకు శరీరములోని అన్ని భాగములకన్న రెక్కలలో బలమెక్కువగా నుండును. వీటిరెక్కలు ఉల్లిపొరలకంటె అతిసున్నితముగనుండును. ఇట్టి, సున్నితమైన రెక్కలుగల కీటకములు, తమకన్న రెండు రెట్ల బరువును తీసికొని ఒక గంటకు నలుబదిమైళ్ళ వేగముతో ఎగురగలుగుచున్నవి. దోమలు తమ కన్న రెండు రెట్లబరువును మోయుచు అసాధారణమైన వేగముతో ఎగురగలవు. ఇట్లు ఎగురునపుడు ఇవి 1 సెకనుకు వీటిరెక్కలు 300 సార్లు ఆడించును. మిడ్జ్ (Midge) అనుపురుగు దాని రెక్కలను 1 సెకనుకు వెయ్యి సార్లకుపైగా ఆడించగలదట. ఒకవిధమైన గాజు పురుగు (Scarab - beetle) తనకన్న 850, రెట్ల బరువును మోయగలదని ఒక కీటక శాస్త్ర వేత్త (Entomobogist) కని పెట్టియున్నాడు.

కీటకములు చూచుటకు బలహీనముగ నుండును. డాక్టర్ లూడ్జ్ అను అమెరికన్ పరిశోధకుడు కొన్ని తేనెటీగలను ఒక గొట్టములో బంధించి గాలిని తీసివేసెనట. అనగా ఆ గొట్టములోనున్నది శూన్య ప్రదేశము. తరువాత, కొన్నిగంటల తరువాత వాటిని బయటికి తీసివేసెను. అప్పటికి అవి బ్రతుకుతునే యున్నవట కాని మానవులైనా, క్రూరమృగములైనా మరణించి యుండవలసినదే.

వివిధ కీటకముల శరీరనిర్మాణము వివిధముగనుండును. వాటి మేధాశక్తి వర్ణింప వీలులేదు. కీటకములకు చెవులు అనేక భాగములందుండును. క్రికెట్స్ (మిడుత) అనువాటికి చెవులు మోకాళ్ళపైనుండును. సైకెట్స్ అనుకీటకములకు గర్భకోశములపై చెవులుండును. కుమ్మరిపురుగులు హృదయముతోవినును. బుష్‌క్రికెట్స్ (పొదలలోనుండు మిడుతలు), అతిసున్నితమైన శబ్దమును వినగలుగును. మానవుడు

సెకనుకు 20000, వైబ్రేషన్ల శబ్దమును వినగలదు. ఈ మిడుతలు 45000, వైబ్రేషన్ల - శబ్దమును వినగలవు. ప్రపంచ మెల్లప్పుడు నిశ్శబ్దముగా లేదనియు, కీటకముల శబ్దములతో నిండియున్నదనియు, ఈ కీటకములు చేయు శబ్దమును విను శక్తి మానవునికి లేదని కొందరు కీటకశాస్త్రజ్ఞులు, చెప్పియున్నారు.

కీటకములకు కండ్లు నెత్తిపై నుండును. కొన్ని కీటకముల కండ్లను మనము చూడలేము. కొన్ని కీటకములు వెలుతురు వద్దను, కొన్ని చీకటిలోనుండును. మన ఇండ్లలోనుండు నల్లులకు వెలుతురంటే పడదు. మిడుతలు, దోమలు చీకటిలో నుండలేవు. కొందరు మేధావులైన ఫోటోగ్రాఫర్లు కీటకముల - కండ్ల ప్రతిబింబములను తీసియున్నారు. అన్నిటికంటె తుమ్మెదల కంటిశక్తి పొగడదగినది. ఎంత దూరపువస్తువునునైనా చూడగలదు.

మానవునివలె కీటకములకు రుచిని చూచు అవయవములున్నవి. తేనెటీగలు, తుమ్మెదలు, సీతాకోక చిలుకలు మొదలగునవి రుచిని వాటి నాలుకలతోనే కాక, పాదములతో చూచును. ఒకభాగము చక్కెర, 200 భాగములు నీటిని కలిపినచో, నీరుకొలదిగా రుచించును. అప్పుడు మానవుడు దానిరుచిని కనిపెట్టగలడు. ఒకభాగము చక్కెర, 300000 భాగముల నీటిని కలిపినను దాని రుచిని కనిపెట్టగల శక్తి సీతాకోకచిలుకకున్నది.

ఇతరజ్ఞానేంద్రియములవలె కీటకముల నాసికములు చాల శక్తివంతములైనవి. జంతువులు వాసనచూచి వాటి సంతానమును గుర్తుపట్టును. కుక్క వాసనచూచి యజమానిని గుర్తుపట్టును. ఇట్లే కీటకము వాసనను బట్టి వాటి జాతిని (Sex) కనిపెట్టగలదు. ఒకవిధమైన మగజాతి కీటకము 9 మైళ్ళ దూరములోఉన్న ఆడు కీటకమును గుర్తుపట్టగలదట.

కీటకజాతికి ఇట్టి వర్ణింప వీలులేని శక్తులున్నవి. కీటకశాస్త్రజ్ఞులు, ప్రపంచములో కీటకములను గురించి పరిశోధించుచున్నారు. ఇట్టి మహత్తరశక్తిగల కీటకములను పరిశోధించు శక్తి మానవునికి ఉన్నదంటే ప్రశంశనీయముగదా!

[ఆంగ్లవ్యాసానికనుసరణ]

# టెలిఫోను సౌరశక్తిచే పనిచేయుట — అమెరికా సంయుక్త రాష్ట్రములలో పరిశోధన

శ్రీ ఆకుండి వెంకటశాస్త్రి

"హల్లో! నేను; జార్జి మేత్యూసును మాట్లాడు చున్నది. నావి, దూది బేళ్లు నీవేర్ హౌసులో ఎన్ని ఉన్నాయి?" అని దూది వ్యాపారంచేసే రైతొకడు జార్జియా అనే గ్రామములోనున్న ఫోనులో మాట్లాడెను - సూర్యకిరణాల శక్తిచే పని చేసిన టెలిఫోను పై పైమాటలే మొట్టమొదట వినబడెనట. సూర్యకిరణములనుండి గ్రహించిన విద్యుచ్ఛక్తిని నిలువచేసికొన్న ఒక బేటరీవలన పై పేర్కొన్న మాటలు దూరముననున్న వానికి వినబడినవి.

ఈ సౌరకిరణములనుండి విద్యుత్తును గ్రహించి నిలువచేసికొను నీ యంత్రము ఒక్క అణా సైజులో నున్న మిక్కిలి రిఫైన్డు సిలికాన్. ఇందు 432 లోహపు రేకులతో (Discs) (అణా సైజులో నున్నవి) సమకూర్చబడినది. ఇవి విద్యుదాకర్షకము లైన బోరన్, ఆర్సెనిక్ వంటి వస్తువుల చేకూర్చ బడెను. ఈ యంత్రము సూర్యకిరణములనుండి యీ 'శక్తి'ని గ్రహించి నిలువచేసికొనును. ఈ సూర్య కిరణములా యంత్రములో ఆ (Surface) స్థలమును తాకగనే ఎలక్ట్రోస్టేటిక్ ఛార్జి పుట్టించును. ఈ శక్తి రాగితీగలచేకొనిపోబడి టెలిఫోన్ సర్క్యూట్న కుపయోగించును. లేదా ఒక బేటరీలో నిలువ చేయబడును. ఈ సౌరపు బేటరీలో 10 వాట్ల విద్యుచ్ఛక్తి ఉత్పత్తియగునట. ఈ 10 వాట్ల శక్తి గల విద్యుత్తు; టెలిఫోను - మాట్లాడు శబ్దమును ట్రాన్స్మిట్ చేయుటకు సమర్థమైనదట. ఈ శక్తి పగటివేళ టెలిఫోనుపనిచేసినందున ఖర్చుపడిపోగా మిగత రాత్రులలో నిలువయుండునట. అమెరికా లోనే సూర్యశక్తిని సోలార్ స్టవ్వులలోనికి ఆకర్షించి వంటపనుల కుపయోగించునటుల మేరియా టెల్కెసు అను నామె పరిశోధించి తెలిసికొని సోలార్ స్టవ్వు తయారుచేసినది.

ఇండియాలోకూడ సూర్య శక్తిని మానవుని అవసరములను తీర్చుట కుపయోగించు సాధన సృష్టిగా శాస్త్రవేత్తలు చేయగల్గుచున్నారు. విద్యుచ్ఛక్తి తీగలద్వారా గ్రామసీమలలో మారుమూలల కందింపరాని చోటులకెల్ల యీ సోలార్ (సూర్యసంబంధమైన) టెలిఫోనులెంతయు నుపయోక్తములు.

# బంగారు తిమ్మరాజు కథ

శ్రీ టేకుమళ్ల కామేశ్వరరావు

—(౦)—

ఇదొక జంగంకథ - ఆఖ్యానం, అనగా, గేయం వచనం కలది. ఇది చారిత్రక కథ. సుమారు ఏడు వందల పంక్తులున్నాయి. దీనిలో స్తుతికి సంబంధించిన అవతారిక లేదు. ఈ పదాన్ని పాటగాళ్లు పాడుతూంటారు.

## చారిత్రకాంశాలు ; భౌగోళికాంశాలు

ఈ ఆఖ్యానంలో చాల మంది రాజుల పేర్లు, పట్టణాల పేర్లు ఉన్నాయి. పెనుగొండ రాజ్య వ్యవహారం దీనిలో చిత్రించబడింది. ఈ కింది పట్టణాల ప్రసక్తి ఉంది - పెనుగొండ, బెల్లపుకొండ, పెద్దాడ, తిరుపతి, కంచి, అనంతగిరి, శేషపట్టణము, నల్లగుండు - ఇది కమ్మర్లకు ప్రసిద్ధి.

పెనుగొండ - ఇదొక పట్టణం; అనంతపురం జిల్లాలో గుంటకల్లునుండి హిందుపురం వెళ్ళే రైలు దారిలో ఉంది; గుంతకంటికి 89 మైళ్ల దూరం. తిరుపతి - సుప్రసిద్ధ పుణ్య క్షేత్రం; చిత్తూరు జిల్లాలో ఉంది. కంచి - చెన్నపట్టణానికి దక్షిణంగా 30 మైళ్ల దూరంలో ఉంది.

ఈ పాటలో ఈ కింది వ్యక్తులు కొందరు కనబడుతున్నారు. రాయలు పెనుగొండను ఏలే రాయలు.) అతని అన్నదమ్ములు_విఠలరాజు, వీరరాజు, కటికం రాజు (?) కళింగరాజు, రఘుపతిరాజు, భూపతి రాజు, కూర్మరాజు. రఘుపతిరాజు భార్యపేరు మేనమ్మ. ఆ రాజదంపతుల కుమాళ్లు బంగారు తిమ్మరాజు, కృష్ణరాజు, పూల రంగరావు. తిమ్మరాజుయొక్క భార్య మాణిక్యదేవి. అతనియొక్క బావ మేఘంరాజు. ఈ పేర్లలో కొన్ని కల్పితాలని ఊహించవచ్చు.

ఈ కథలో సవరం ♦ సారప్ప అను పాత్ర ఉంది. పీడి అక్కగారు బోగంది రంగసాని. ఈ రెండు పేర్లు నిజవ్యక్తులకు పెట్టిన మారు పేర్లలాగు తోస్తూంది.

## ఆనాటి చరిత్ర

* విజయనగర సామ్రాజ్య పాలకుడైన సదాశివ రాయలు (క్రీ. శ. 1542) పేరుకి మాత్రమె రాజుగా ఉండేవాడు. అతని బంధువైన ఆరవీటి రామరాయలే నిజంగా పరిపాలనచేసేవాడు. 1565 లో విజయనగరరాజుకి, మహమ్మదీయ సుల్తానులకు జరిగిన యుద్ధంలో విజయనగర రాజు ఓడిపోయేడు. ఆ యుద్ధంలోనె ఆరవీటి రామరాయలు, అతని తమ్ముడు వేంకటాద్రి మరణించేరు. రామరాయల రెండో తమ్ముడైన తిరుమలరాయలు అధికారం వహించి, సదాశివరాయలతో కూడ పెనుగొండకు వచ్చేడు. సదాశివరాయలు చంపబడ్డాడు. తిరుమలరాయలు సింహాసన మెక్కేడు. 1565 నుండి పెనుగొండే విజయనగర రాజ్యానికి ముఖ్యపట్టణమయిందని చెప్పవచ్చు. తిరుమలరాయలు తొంబై

♦ సవరం అను ఇంటి పేరుగలవారు ఆ కాలంలో లేకపోలేదు. సవరము చిన్న నారాయణ నాయకుడు అను కవి విజయనగర రాజ్య పాలకులైన శ్రీరంగరాజు, వెంకటపతి రాయలకు సమకాలికుడు. ఇతను కువలయాశ్వ చరిత్ర అను ఆంధ్ర ప్రబంధాన్ని రచించాడు.

* Journal of the Andhra Historical Research Society Vols. 17, 18 లో విజయనగర సంగ్రహ చరిత్రను వ్యాసంలోని కొన్ని అంశాలు ఇక్కడ తీసుకోబడ్డాయి.

ఏళ్లతోక్క. అతని పెద్ద కుమారుడు చిన్నతనంలోనే మరణించేడు. రెండవ కుమారుడైన శ్రీ రంగరాయలకు 157[illegible] లో పట్టాభిషేకం చేసేడు, పెనుగొండమీదికి సుల్తానులు దండయాత్ర చేసేరు. కాని పెనుగొండమట్టుకు స్వాధీనం కాలేదు. త్వరలోనె తిరుమలరాయలు మరణించేడు. శ్రీ రంగరాయలు 1585 వరకు రాజ్యం చేసేడు. అతనికి పుత్ర సంతతి లేకపోగా, అతని రెండవ తమ్ముడైన రెండవ వెంకటరాయలు 1585 లో రాజ్యానికి వచ్చేడు. రాజకీయ పరిస్థితులు బాగులేకపోగా అతను 1592 లో ముఖ్య పట్టణాన్ని పెనుగొండ నుండి చంద్రగిరికి మార్చినట్లుగా చెప్పబడుతూంది. వెంకటరాయలకి ఆరుగురు భార్యలు; కాని పుత్ర సంతానం లేదు. అతను తన జీవితం ఆఖరి దశలో తన అన్నయొక్క రెండో కుమారుడైన రంగరాయలను దత్తతచేసుకొన్నాడు. వెంకటరాయలు 1614 లో స్వర్గస్థుడయ్యేడు. అతని అనంతరం రాజ్యంలో కలహాలు ప్రారంభమయ్యేయి. అనగా, సింహాసనం ఎక్కిన రంగరాయలతో, అతని అన్న తిరుమలరాయలు, తాను హక్కుదారుణ్ణి అంటూ యుద్ధానికి దిగేడు.

## రెండవ వేంకటరాయల పరిపాలన

1585 నుండి 1614 వరకు పరిపాలించిన రెండవ వేంకటపతి రాయల కాలమె బంగారు తిమ్మరాజు కథకు ముఖ్యం కాబట్టి ఆ రాయలనాటి పరిపాలనలోని కొన్ని సంగతులను తెలుసుకొందాము. *

(సశేషము)

* టి. శివశంకరంగారు (పెనుగొండ కాపురస్థులు) వ్రాసిన 'వెంకటపతిదేవ మహారాజు' అను చిన్న పుస్తకంలోని కొన్ని అంశాలను ఇక్కడ తెలియజేసేను.

# సంపాదకీయములు

## అవిద్యానిర్మూలనం

ఐదారేళ్లలో చైనాలో అవిద్యా నిర్మూలన నుద్దేశించి ప్రభుత్వము ఉద్యమము ప్రారంభించుట హర్షించతగినది.

అవిద్యా నిర్మూలనవలన ప్రజలలో ఏర్పడగల చైతన్యము, పురోభివృద్ధి, దేశానికేకాకుండా ప్రపంచానికి సయితము మహోపయుక్తము కాగలదు.

## భూదానయజ్ఞలక్ష్యం

ప్రతి కుటుంబానికి తగు భూవసతి కల్పించడమే తన అభిమతమని ఆచార్య వినోబాభావే ప్రకటించారు.

భూమిని నమ్ముకొని కృషిసల్పి జీవించదలచుకొనిన కుటుంబానికి భూవసతిలేమి కొరతను తీర్చడం భూదానోద్యమలక్ష్యము.

ఈ ఉద్యమం ప్రజల జీవనప్రమాణాన్ని పెంచడంతోబాటు దేశాన్ని సస్యశ్యామలంగా చేయనుండటం హర్షణీయము.

## ఉత్తమమైన సలహా

ఆంధ్ర మంత్రి శ్రీ ఓబులరెడ్డిగారొకచోట "స్వీయవృత్తుల వీడి చాకిరిలకు ప్రాకులాడవద్దు" అని ప్రజలకు హితవు చెప్పారు. ఇది కొందరికి వెగటుగానున్నా ప్రతివృత్తి సమానంగా గౌరవనీయంగా ప్రజల దృష్టిలోకి వచ్చినప్పుడు మంత్రిగారి హితవు పాటించతగింది.

తాము చేస్తున్న వృత్తికంటె మరొకటి ఉన్నతమయినదని ప్రజలు భావించినా, వృత్తులలో నీచ, ఉత్తములుగా వర్గీకరణ అమలునందున్నా ప్రస్తుతము అమలునందున్న కులమతవర్గ పోరాటము సులభంగా నశించదు.

స్వీయవృత్తులను ఆసక్తితో ఆధునిక పద్ధతులలో అవలంభిస్తూ, తమ పురోభివృద్ధితో బాటు మొత్తంగా జాతీయ శ్రేయస్సుకు ప్రజలు కృషి సల్పడం వాంఛనీయము.

## దేవాదాయాల సద్వినియోగం

దేవాదాయ నిధులు నిరర్థకంగా వ్యయపర్చక సద్వినియోగపరచబడాలనునది గమనించతగిన విషయం.

ముఖ్యంగా విద్యావ్యాప్తికి, లలితకళలలాంటి సంగీతము, నృత్యముల పట్ల ఆసక్తి, పిపాస ప్రజలలో పెరుగడానికి దేవాదాయ నిధులు వినియోగపడటం వాంఛనీయము.

ఈ నాటికింకా అనువైన విద్యావసతులు విరివిగా లేని కొరతను తీర్చడానికి దేవాదాయ నిధులు వినియోగపరచవచ్చును.

విద్యాకేంద్రాలతో బాటు కళాపిపాస, కళారాధన ప్రజలలో నవచైతన్యమును పూరించగలవు. సౌభాగ్యవంతమైన ప్రజాశ్రేయో పురోభివృద్ధులకు దేవాదాయనిధులు వినియోగపడటం మంచిది.

## వివాహమహోత్సవములు

పూజ్యబాబు కేసరిగారి కుమార్తె సౌ. వసంతకుమారికి, శ్రీ కే. నారాయణ మీనన్‌కు గురువాయూర్‌లో 31–5–56 న వైభవంగా వివాహం జరిగింది.

వధూవరులను అశేషబంధుమిత్ర పరివారము అభినందనలతోబాటు ఆశీర్వదించారు.

గురువాయూర్ అప్పన్ కృపాకటాక్షంతో వధూవరులిద్దరు ఆయురారోగ్య ఐశ్వర్యాలతో ఆదర్శనీయమైన వైవాహిక జీవితము గడుపగలరని ఆశిస్తున్నాము.

◆ ◆ ◆

జమినీ స్టూడియోస్ అధినేత, ప్రముఖ చలనచిత్ర నిర్మాత, పత్రికారచయిత శ్రీయస్. యస్. వాసన్ గారి కుమారుడు చిరంజీవి బాలసుబ్రహ్మణ్యంకు, సౌభాగ్యవతి సరోజకు యీ నెల 4వ తేదీన వైభవోపేతంగా వివాహం జరిగింది.

వివాహమండప నిర్మాణం, మనోజ్ఞమైన ఏర్పాటులు ఆనాటి మయ సభను మరపించునవిగా నుండినవి.

మంగళవాయిద్యాలు, గానకచ్చేరీలు విరివిగా జరిగినవి.

వధూవరులను అశేషబంధుమిత్రులు అభినందించి, ఆశీర్వదించడం కనులపండుగగా నుండినది.

భగవంతుడు వధూవరులకు సకల భోగ భాగ్యాలతో ఆశీర్వదిస్తూ, వారిద్దరూ శ్రీయస్. యస్. వాసన్ గారిలాగనే ప్రజాహితాన్ని ప్రోత్సహించేలాగ అనుగ్రహిస్తాడని మా ఆశ.

## శ్రీ దుర్ముఖినామ సం॥ర జ్యేష్ఠ ఆషాఢమాసములు

| | | | |
|---|---|---|---|
| 1956 సం॥ జూన్ నెల | 16 | శ | అ 7.57 ఉఫ 18.47 త్యా 3-57 |
| | 17 | ఆ | న 4.58 హ 17.57 త్యా 4.2 |
| | 18 | సో | ద 3.10 చి 18.17 |
| | 19 | మం | ఏ 2.37 స్వా 19.53 |
| | 20 | బు | ద్వా 3.18 విశా 22 33 |
| | 21 | గు | త్ర 5.9 అనూ 26.28 |
| | 22 | శు | చతు 7.57 జ్యే 31.11 త్యా 4-22 |
| | 23 | శ | ○ పౌ 11.32 మూ 36.35 |
| | 24 | ఆ | కృ పా 15.41 పూషా 42.27 త్యా 4 24 |
| | 25 | సో | విది 20.6 ఉషా 48.30 త్యా 4.24 |
| | 26 | మం | తది 24.31 శ్ర 54-26 |
| | 27 | బు | చ 28.43 ధ 60.2 త్యా 4.23 |
| | 28 | గు | పం 32-22 శత 60-10 |
| | 29 | శు | ష 35-15 శత 4-47 త్యా 4-16 |
| | 30 | శ | స 37.9 పూభా 8 50 త్యా 4-16 |
| 1956 సం॥ జూలై నెల | 1 | ఆ | అ 37.56 ఉభా 11.49 త్యా 4 వ |
| | 2 | సో | న 37.28 రే 13-39 త్యాజ్యభా ● |
| | 3 | మం | ద 35.46 అశ్వ 14.17 |
| | 4 | బు | ఏ 34.51 భ 13.41 |
| | 5 | గు | ద్వా 28 47 కృ 11.56 |
| | 6 | శు | త్ర 23.48 రో 9.11 త్యా 3.46 మాసశివరాత్రి |
| | 7 | శ | చతు 18.3 మృ 5 37 |
| | 8 | ఆ | ● అమా 11.46 ఆర్ద్రా 1-25 |
| | | | **ఆ షా ఢ మా స ము** |
| | 9 | సో | శు పా 5 12 పుష్య 52.15 త్యా 3.42 |
| | 10 | మం | తృ 52.7 ఆశ్లే 47 52 త్యా 3.43 |
| | 11 | బు | చ 46 15 మ 43.57 త్యా 3.45 |
| | 12 | గు | పం 49.9 పూఫ 40.48 త్యా 3.48 |
| | 13 | శు | ష 37.1 ఉఫ 38-36 త్యా 3.56 |
| | 14 | శ | స 33.56 హ 37-28 త్యా 4 1 |
| | 15 | ఆ | అ 32.5 చి 37-33 |

**Printed & Published by Dr. S. Seshagiri Rao at Lodhra Press,**
**Kesari Kuteeram (Private) Ltd. 15, Westcott Road, Royapettah, Madras.**
**Ag. Editor : C. C. Punniah.**



మోతింగర్ కొండమీది శ్రీ ఆంజనేయస్వామి ఆలయం

By Sri S. T. Arasu

Lodhra Press, Madras-14.